C

## చదువరులకొక విజ్ఞప్తి.

నాయీపాదుషాపరాభవనాటకమునకుఁ బ్రస్తావన వ్రాసి యొసంగిన అర్జునపరాభవ నాటకరాజాది గ్రంథకర్తలును శతావధానులును, మద్గురువరేణ్యులునగు శ్రీమాన్ దూపాటి తిరుమల శేషాద్రి రమణకవులకు నమస్కారములొనర్చుచుఁ గృతజ్ఞుఁడనగుచున్నాఁడ. నాచే వ్రాయఁబడినదికాదు కానఁ బ్రస్తావనలోని యాత్మస్తుతివలన సుధీలోకముచే నేను నిందితుఁడఁగాకుందుఁగాక.

ఔచితికొఱకు చరిత్రాత్మకమగు నీకథను గొన్ని చోటుల నాటకకవిసంప్రదాయానుసారముగ మార్పులు సలిపితినని విన్నవించుచు గుణదోషములఁ జర్చించుభారము సుధీలోకమునకు వదలుచున్నాఁడ.

ఇట్లు

కోటగిరి వేంకటకృష్ణారావు.

D

# సంపాదకవిజ్ఞప్తి

గ్రాహకులారా !

కృష్ణరాయగ్రంథమాలయను నొకగ్రంథమాలను మేము స్థాపించినవిషయము మీకిదివఱకె కరపత్రికములమూలమున వెల్లడించితిమి. ప్రతిష్ఠాపకులును మహోపోషకులునగు శ్రీ కె. వి. కృష్ణారావు బహద్దరువారి యౌదార్యాతిశయముచే నీగ్రంథమిప్పటికి మీకొసంగఁగల్గితిమని సంతసపడుచున్నారము. యుద్ధవిప్లవముచే కలిగిన కాకితముల యభావమే మార్చినెలలో ముద్రింపవలసిన యీపొత్తమింతవఱకుఁ బ్రచురము కాకుండఁ జేసినది. ముందు రానున్న సత్యభామాపరిణయము సకాలమునకుఁ బాఠకులకుఁ జేర్పవలయునని తగు ప్రయత్నములు చేయుచున్నారము. పాఠకులందఱు గ్రంథమాలాభివృద్ధికిఁ దోడ్పడి తమమిత్రులఁగూడఁ జందాదారులఁగఁ జేర్పఁ బ్రార్థితులు.

రానున్న పొత్తములన్నియు కాలికోబైండుగాఁ బాఠకుల కందింపవలయుననియుఁ క్లిష్టపదముల కర్థము రూపపటములు చేర్పవలయుననియు గ్రంథమాలవారు తీర్మానించియున్నారు. ఇప్పటికి మా చందాదారుల సంఖ్య కడు స్వల్పమైనను భాషాప్రపంచమున నగ్రస్థానమువహించిన మహాశయుల ప్రోత్సాహముచే దీనినుద్ధరింపఁ జాలకపోదుమాయను నమ్మకముతో నెట్లో మొదటిపుస్తకము వెలువరించితిమి. సాధ్యమైనంత త్వరలో చందాదారులకుచితముగ నొక యనుబంధగ్రంథముఁ జేర్తుము.

శ్రీకృష్ణరాయ గ్రంథమాల
గంపలగూడెము
కృష్ణాజిల్లా.

ఇట్లు,
శేషాద్రిరమణకవులు, శతావధానులు,
సంపాదకులు.



శ్రీ కోటగిరి వెంకటకృష్ణారావు బహద్దరువారు
గ్రంథకర్త.

శ్రీరస్తు.

# అంకితము.



కరుణామయుండును, శాంతమూర్తియు,

నా శ్రేయోభిలాషియు, స్వర్గవాసియు

నా తండ్రిగారును,

నగు

## శ్రీ కోటగిరి చిన్నయ్యగారి

దివ్యపాదముల కీపాదుషాపరాభవకృతిని

సమర్పించి

కృతార్థుఁడ నగుచున్నాఁడను

ఇట్లు

కో॥ వేంకటకృష్ణరావు

గ్రంథకర్త

శ్రీరస్తు.

# పాదుషా పరాభవ నాటకము.

## కథా సంగ్రహము.

### ప్రథమాంకము.

రాజసింహమహారాజు తురకదోపిడికాండ్రచంపుటకు అరణ్యమునఁ బ్రవేశింపఁగాఁ గొందఱు దొంగలు రాజసింహునిపైకివచ్చెదరు. అంతలో యిరువురు పురుషవేషముతోనున్న స్త్రీలు దోపిడికాండ్రశిక్షించి రాజసింహుని రక్షింతురు. రాజసింహుఁడు తనకైయొక్కఁడు పాటుపడి పురుషవేషము ధరించిన విమల వ్రేలికొక యుంగరమిడి మీదేదేశమని యడుగును. విమలయు నామెచెలియగు పద్మయు తమఆఁడువేషము బయటపడునని పేరుచెప్పక నిరాకరించుటచే రాజసింహుఁడు దాఁగికొని వారిసంగతులు చాటునుండి విని ముందునకువచ్చి వీరకార్యమునకు ఆఁడువారు మగవేషము ధరించినను తప్పులేదని కొంచెముసేపు మాటలాడి తనత్రోవను వెడలిపోవును. విమల రాజసింహునిపై వలపునంది విరహతాపమందును. పద్మ శిశిరకృత్యము లొనర్చును. ప్రొద్దుగ్రుంకుటచే నిరువురు తమయశ్వములనెక్కి నివాసములకు వెడలుదురు.

### ద్వితీయాంకము.

విమలాదేవి తనచిన్నతండ్రి యశవంతసింహుని ఔరంగజేబు చంపెనని విని చిన్నతల్లి చంద్రావతికి దాఁపుగా వ్రాసినజాబు ఔరంగజేబునకుఁజిక్కును. అతఁడు భార్యయగు నుదయపురివలన నందలిసంగతులు విని కోపమంది తన సేనాపతి చేతికి విమల తండ్రియగు విజయసింహునకు నీకుమార్తెను నాకొసంగదవా! నీకోట ముట్టడింపనుందువా! యని జాబువ్రాయించి యిచ్చి కొంతసైన్యమునిచ్చి విమలను విజయసింహుఁడీయకున్న నాతనికోటముట్టడింపుమని పంపును. ఔరంగజేబు తనభార్యతో విమలచేనీకు సేవచేయింతునని బాసచేయును. నయనపాలుఁడనువాఁడు ఔరంగజేబునుదర్శించి చంద్రావతి లభింపలేదని చెప్పును. ఔరంగజేబుకోపించి యుపాయమున్న నయనపాలుని యింటనున్న యిందిరను తెప్పించి యిందిరను తన యింటనుంచి కొన్నందులకు నయనపాలునకు జన్మాంతశిక్షవిధించును. ఔరంగజేబును లక్ష్యపెట్టక యిందిర గర్వముగమాటలాడును. అందులకాతఁడుకోపించి తనభార్యకడ దాస్యమునకు నియోగించును. భార్యకడఁగూడ వికటముగమాటలాడుటచే నాయమ (ఉదయపురి) యిందిరను చంపింపవలయునని ప్రయత్నించును.

## తృతీయాంకము.

ఔరంగజేబు దగ్గరనుండి యొక సేనాపతి వచ్చి రూపనగరాధిపతియు విమల తండ్రియునగు విజయసింహునకు విమల నొసంగుమనా! కోటముట్టడించెదమనుచు వారు జాబొసంగును. దానిని విజయసింహుడు చూచి కాలితోఁ ద్రొక్కి తిరస్కరించి దూషించి పంపివేయును. తురుష్క సైనికులు రూపనగరమును ముట్టడించి విమలను బలవంతముగాఁ దీసికొనిపోవఁ బ్రయత్నింతురు. విమలయుఁ బద్మయు తండ్రిగారి యొద్దనున్న జాబు చూచి యంతిపురికేగి ముందు జరుగవలసినదానిం గూర్చి విచారింతురు. విమల రాజసింహునకు, ఔరంగజేబు సైనికులు తమకోట ముట్టడించిరనియు తనను రక్షింపుమనియు జాబు వ్రాసి సామల్ పండితుఁడను వానికొసంగి రాజసింహునకా జాబు పంపును.

## చతుర్థాంకము.

ఉదయపురి (ఔరంగజేబు భార్య) ఇందిరను యమునానదిలో పాఱవేయుమని కొందఱకాజ్ఞయీయ వాండ్రు నిద్దురపోవు నిందిరను మోసికొనిపోవుచుందురు. హసనల్లీ ఖాను అను మాఱుపేరుతోనున్న రూపసింగా మోసికొనిపోవునది యెవరోయని వెంబడించి యరణ్యమున హంతకులను చంపి మోసికొని తేఁబడిన స్త్రీ తనభార్యయని గ్రహించి యామెను సేదఁదీర్చును. రూపసింగు తాను ఇందిరతో నీభర్తనని చెప్ప నామెయు నమ్మకపోవును. పిదప ఇందిర రూపసింగును భర్తయని గ్రహించును. రూపసింగు తన భార్యచే రాజసింహున కొక జాబు పంపును. ఇందిర పురుషవేషము వహించి యాజాబు చేకొని వెడలిపోవ నుద్దేశించును.

## పంచమాంకము.

ఉదయపురి ప్రభువగు రాజసింహుని యొద్దకు సామల్ పండితుఁడు విమలయొసంగిన జాబు చేర్చును. రాజసింహుఁడా జాబు చూచి విమలను రక్షించెదనని వాకొని సైన్యముతో రూపనగరమునకుఁ బ్రయాణము చేయ సిద్ధముగ నుండును. ఇంతలో యిందిర పురుషవేషముతో రాజసింహునిచేరి తనభర్తయిచ్చిన జాబొసంగును. ఆ జాబువలన విమల రక్షణార్థమై తానేఁగఁగనే ఔరంగజేబు తనపట్టణము ముట్టడింప సేనతో రానుండెననియు, అవచ్చు సైన్యము నారావళిపర్వతమధ్యమునుండి రూపసింగు నడపించుననియు గ్రహించి పర్వతములమధ్య ఔరంగుని సైన్యమును మట్టుపెట్ట యత్నమొనరించి రాజసింహుఁడు విమలను రక్షింప రూపనగరమునకుఁ బోవును.

## షష్ఠాంకము.

తురకల చేతలకు వెఱచి విజయసింహుఁడు తనకోట దక్కదని తలంచి విమల మొదలగువారలనభిమానసంరక్షణార్థమగ్ని ప్రవేశముచేయ నాజ్ఞయొసంగును. స్త్రీలందఱగ్ని ప్రవేశముచేయ సిద్ధముగ నుందురు. ఇంతలో రాజసింహుఁడు తురకసేనలఁ బాఱఁదోలి యంతఃపురమునకు విజయసింహునితో నేతెంచి స్త్రీల నగ్నిప్రవేశము చేయకుండ నివారించును. విజయసింహుఁడు తన కుమారితయగు విమల వ్రేలియుంగరముచూచి రాజసింహుని వలచినసంగతి గ్రహించి రాజసింహున కొసంగి పెండ్లియొనర్చును. పద్మను శివసింగునకిచ్చి పెండ్లిచేయుటకు విమలను రాజసింహునితో నత్తవారింటికిఁ బంపుటకు నిశ్చయించి యందఱు విశ్రమింతురు.

## సప్తమాంకము.

ఔరంగజేబు సేనాసహితముగ నుదయపురిని ముట్టడింపవచ్చుచుండ నారావళి పర్వతములమధ్య రాజసింహుఁడా సేనల బంధించి మార్గముల నిరోధించి జాగరూకతగాఁ గాచియుండును. ఇంతలో రూపసింగ వచ్చి రాజసింహునితో తురకల దుర్గతి వచింపఁ జాలిపడి, తురుష్కులకు, యుద్ధవ్యయములొసంగి అన్యమతద్వేషముమానిన రక్షింతునని రాయభారిని పంప నౌరంగజేబు నిరాకరించును. విమల నుదయపురిచే (ఔరంగజేబుభార్యచే) దాస్యముచేయించి సామల్ పండితుఁడు విమలతోఁ బ్రవేశించును. విమల ఔరంగజేబును నిరసించును. ఔరంగజేబు సంధినియమముల కంగీకరించును. తురుష్కసైనికుల విడచిపెట్టుటకు రాజసింహుఁ డంగీకరించును. ఔరంగజేబునకు విమలను కోరినందులకు ఇందిర నగౌరవము సలిపినందులకుఁ బరాభవము జరుగును.

భరతవాక్యముతో నాటకము ముగియును.



# నాటకమునవచ్చుపాత్రలు.

పురుషులు.

సూత్రధారుఁడు.
రాజసింహుఁడు.
నయనపాలుఁడు.
ఔరంగజేబు.
మసావదు.
సాదత్ ఖాను.
హిందూసేవకుఁడు.
రూపసింగు లేక హాసనల్లీఖాఁ
సామిల్పండితుఁడు.
తురుష్క సేవకుఁడు.
అచ్చన్న
వెంకన్న.

స్త్రీలు.

విమలాదేవి.
పద్మ.
ఇందిర.
ఉదయపురి.

# పీఠిక

రసికాగ్రేసరులారా!

ఈ నాటక రాజమునందలి కథావస్తువు ప్రఖ్యాతమని చెప్పనగు భారతవీరులకుఁ బిమ్మటఁ దాదృశశౌర్య పరాక్రమాది మహోదాత్త గుణ సంపదచే హైందవక్షాత్రధర్మమును బ్రకాశింపఁజేసి, ప్రపంచ చరిత్రమున హైందవజాతికి నెల్ల నగ్రస్థానమును గడింపఁగల్గినవారు రసపుత్త్రులనుట యతిశయోక్తిగాదు. ఈ నాటకమునకుఁ గథానాయకుఁడు రసపుత్త్రవీరుఁడగు రాజసింహుఁడు. కథానాయిక విమలాదేవి. ప్రతినాయకుఁడు మహమ్మదీయ చక్రవర్తియగు నౌరంగజేబు. ఈకథ యిదివఱకే "విమల" యనుపేర నాఖ్యాయికగ వ్రాయఁబడి సుప్రసిద్ధినిఁ గాంచియున్నది.

2 హిందూదేశము రసపుత్త్రవీరులకుఁ బితృపితామహార్జితమగు జన్మభూమి. మహమ్మదీయులు విదేశీయులు. వీరలు మాయోపాయములచేతను, స్వపరాక్రమముచేతను, రసపుత్త్రులను నిర్జించి, హిందూధర్మము నవమానించి, తద్రాజ్యముల నాక్రమింపఁదొడఁగిన తరుణమున స్వధర్మ స్వరాజ్య రక్షణ తత్పరులయిన రసపుత్త్రజాతి చూపిన బాహుబలపరాక్రమమును, రాజ్యతంత్రనిర్వహణ కౌశలమును, నిరుపమానములు, హిందూజాతికి నుత్తేజకములు. ఈకథలోని నాయకప్రతినాయకు లన్యోన్యవిరుద్ధ ధర్మసంబద్ధ మతావలంబకులగుటచేఁ దత్కలహము, కేవల మేకామిషలోభ ప్రేరితముగాక ధర్మప్రేరితమయి విలక్షణాకారము ధరించినది. ధర్మాధర్మ సంఘట్టనమునందే మానవజాతియం దంతర్లీనమగు మహాగుణములు ప్రకాశమునకు రాఁగలవు. అసూర్యంపశ్యలగు రాజకుమారికలే పురుషవేషధారిణులయి, శత్రుమారణకర్మమున నప్రమత్తలై విహరించిరనిన, వీరరసావతారమూర్తులగు తత్పురుషులమాట చెప్పనేల? సహజభీరువులగు నబలలను రణరంగవిహారిణులగు ధీరలుగ మార్పఁగల్గు నంతవీరరసోద్రేక

మునకుఁ బ్రధానకారణము స్వధర్మస్వదేశాభిమానమే యని చెప్పక తప్పదు.

3 ఇన్నాటకమునందలి కథానాయికయగు, విమలాదేవియొక్కయు నిందిరాదేవియొక్కయు గుణోన్మీలనమునందుఁ గవి కనఁబఱిచిన సందర్భశుద్ధి యనన్య సామాన్యము. స్త్రీలకుఁ బురుషులతోఁ బాటు సంపూర్ణవ్యక్తి స్వాతంత్ర్యముండి తీరవలెనని యభినవనాగరికుల మతము. కాని స్వాతంత్ర్యము స్వధర్మపారతంత్ర్య గర్భితము. స్వధర్మ వివక్షయందు హైందవస్త్రీలకును, దదన్య స్త్రీజాతికినిఁ జాలఁ దారతమ్యముగలదు. హైందవ స్త్రీకిఁ గులాభిమానమగ్గలము. వైభవాదుల నాశించి విజాతీయుని స్మరింపనొల్లదు. అట్టి నీచకృత్య మొనర్చినందునకు విమలాదేవి యుదయపురియందుఁ గనఁబఱిచిన యసహ్యతయే నాయక ప్రతినాయకులనుఁ గల్గిన కలహమునకు బీజము. మఱియును హైందవ స్త్రీదృష్టియందు వివాహమైహికముగాదు, పారలౌకికము. భౌతికము కాదు, ఆత్మీయము. " రసోవైసః " అను శ్రుతి ప్రమాణముచేఁ బ్రేమ రసస్వరూపుఁడుగదా భగవంతుఁడు. ఈనుపాహాన్న తాదర్శమే, యాపత్సమయములయందు శస్త్రధారిణులయి స్వమాన రక్షణకార్యమందుఁ బురుషులకు సాయపడుటకుఁగాని లేదా యగ్ని ప్రవేశము చేయుటకు గాని రసపుత్రాంగనలను బురికొల్పుచుండెను. అట్టివీరపత్నులగు పతిప్రతామణులకు స్వాతంత్ర్యమనునది సువర్ణమునకుఁబరిమళమబ్బుటయే. భర్తృపరోక్షమున స్వపాతివ్రత్య రక్షణమునకునుఁ దత్సమక్షమున స్వరాజ్య స్వధర్మ రక్షణమునకును నక్కాలపు వీరయువతీమణులుధనుర్విద్యావైశారద్యము సంపాదించి వినుతిఁగాంచిరి.

4 నాటకరచనయందే తత్కవిరాజు పూర్వోదాహృతమగునాఖ్యాయికాకృతి యందలి కథా సంవిధానమును గొన్నిచోటుల సందర్భోచితముగ మార్చియున్నాఁడు. స్వదేశ ద్రోహియయిన నయనపాలుఁడు చక్రవర్తి విధించిన శిక్షనుండ తప్పించుకొని, యిందిరారూపసింగుల సమావేశమునకు వారలఁ గలిసినట్టు లాఖ్యాయికయందు వర్ణింపఁబడి

యున్నది. ఈకృతియందన్ననో, పశ్చాత్తాపమాత్రముచే నయనపాలుని విడువఁగూడదని ధర్మదేవతయే తన్మహాద్రోహమును జన్మాంత శిక్షా రూపమునఁ గట్టికుడుపుచున్నది. పుణ్యాపాపము లత్యుత్కటమగుచో నిహముననే తత్ఫలమనుభవమునకు వచ్చునని గదా యార్యోక్తి. రూపసింగునకు హాసనల్లీయనెడు ప్రచ్ఛన్న వేషమున నిందిరాసమావేశము కల్పింపఁబడెను. పరోక్షమున నీవీరదంపతులకుఁగల పరస్పర నిర్వ్యాజ గౌరవప్రేమములను బ్రకాశింపఁ జేయుటయే యీకల్పన యుద్దేశ్యముగా నెన్నఁదగినది. ఏతద్వర్ణనముసంమునువిమలా రాజసింహులః పరస్పరానురాగోదయవర్ణనమునందును, గవికిఁగల సాత్వికశృంగార రసవేత్తృత్వము వెల్లడియగుచున్నది. సామల్పండితుని హాస్యమాహ్లాదకరము.

రాజసింహుని సంధినియమములును నాఖ్యాయికయందుఁగన్పట్టవు. కవికల్పితములె. ఇందు హిందూజాతికి సామాన్యమగు స్వధర్మాభిమానము, జాతిద్వేషపురస్కృతముగాని పరధర్మసహిష్ణుతిశరణాగతత్రాణ ప్రధానమగు నౌదార్య సంపత్తి మొదలగు నుత్తమగుణములకు జయమాపాదింపఁబడినది. ఈమార్పులవలన, నాఖ్యాయికయందలి కథాశరీరమునకు నిక్కవిశిఖామణి జీవముపోసినాఁడని చెప్పవచ్చును.

ఏ కృతికర్తగారు జమీందారులు ప్రభువంశ సంభూతులు. రసపుత్రశౌర్య పరాక్రమాది గుణగ్రహణ రసికత్వము వారుగ్గఁ బాలతో నేర్చినవిద్య. అట్టియాత్మలు వీరరసప్రపంచ సంచారతత్పరములనుట యొకవింతగాదు. కాని యితర జమీందారులవలెఁగాలము వృథపుచ్చక శ్రీవారాంధ్రసారస్వతము నధికరించి, యందు స్వభావమాధురీమాధురీణ ధోరణులతో నవరసాశ్రయంబులగు కావ్యనిర్మాణములకుఁగడంగి, యభినవకృష్ణరాయలను బిరుదమునుధరింపఁగల యోగ్యతతో విరాజిల్లుచు, నాంధ్రకవితామతల్లిని నిదివఱకే శృంగారతిలక, యావననిగర్హణాది చాటుప్రబంధములచేతను, నభినవపాండవీయ నాటకరాజముచేతను నలంకరించి ప్రస్తుతమీనూతన సువర్ణోపహారమును దర్శి

పాదసన్నిధి నర్పించుకొనుచున్నారు. బుధులేతత్కావ్యరసాస్వాదనముచే నానందించెదరుగాక. స్వసేవచేయుటకు శాంతమాత శ్రీవారి నాశీర్వదించుగాక సకలలోకేశ్వరుఁడగు శ్రీయఃపతి శ్రీవారికి నాయురారోగ్యైశ్వర్యపరంపర ప్రసాదించుఁగాక!

27—5—16
గుంటూరు.

గో॥ రమాకాంతాచార్యులు. బి.ఎ.



శ్రీమత్పరదేవతాయైనమః

# పాదుషాపరాభవము

- నాంది -

అనవద్యున్, విమలున్, క్షమాజనితభవ్యాత్మున్, దురూహావశం
బున, గోద్వేషియొకండు గోరఁగ, బలంబుల్ జూపి, వంచించి, త
జ్జనకున్ దన్నియు, రాజపుత్త్రిలకు హృత్సమ్మోదముల్ గొల్పిన
య్యనవంశ్యుండగు రాజసింహుకృప మీకిష్టార్థముల్ కూర్చుతన్॥

చం॥ సిరులకుఁబట్టుగొమ్మ, కవిశేఖరులన్ గనుపారఁగన్నసుం
దరి, రమణీయ సద్గుణవితానవిభాసుర, దేశభక్త సం
భరిత, ప్రచండరాణ్ణిచయ మానసపంజరలోల, దుష్టసం
హారణరతాత్మయౌ భరతమాత, మిమున్ దయతోడఁ బ్రోచుతన్॥

[నాంద్యంతమున సూత్రధారుఁడు]

నాటక సందర్శనమునకై సభ్యులువిచ్చేసి చాలతడవయ్యె. ప్రకృత ప్రయోగ యోగ్యమగు నాటకమునుగూర్చి యోజించుటకై నన్నుఁ బిలువుఁడనిన నటి యింకనురాదయ్యె. కారణమేమైయుండును? (నేపథ్యముం జూచి) ఏవియో పుస్తకముల వెదకుచున్నది. ఇది విలంబన మొనరింపఁదగిన సమయముకాదు. పిలచెదఁగాక. (బిగ్గరగ) నటీ! ఒక్కమారిచ్చటకు వచ్చిపోవునంతటి యవకాశము కలదా?

నటి--(ప్రవేశించి) మీరు పిలచుచుంటిరని వచ్చితిని. ఇంక నే ననుకొనిన గ్రంథరత్నము లభింపలేదు. తృటికాలము సెలవొసంగిన నా పుస్తకమును వెదకి తీసికొనివచ్చెదను.

సూత్ర-చేతినిండ నన్ని పుస్తకములుంచుకొని యింకఁ బుస్తకములు పుస్తకములనియేదేల? నీవు వరింపఁబోవు ప్రసంగమీ పుస్తక

ములతో ముగింపుము. కొఱంతపడిన చూచుకొందము.

నటి-నాయకా! మీరెన్ని చెప్పినను నామనసు కుదురదు. నేఁడు ప్రదర్శింపఁ దగిన నాటకమిదియని యొకదాని నేరిపెట్టితి. ప్రస్తుతముకాన రాదయ్యె. ఇఁక నేను మీకుఁజెప్పునదేమున్నది.

సూత్ర-(తనలో) ఈసుందరి యలంకారమొనర్చుకొను తఱి చెంగటఁ బదిలముగనుంచికొనినయీపాత్తమును దెలియకుండఁదెచ్చితిని ఈపుస్తకముపై నీసతికనురాగ మెక్కుడని వినియున్నాఁడ. ఇపుడు నేను దీనిఁబ్రదర్శింప నూహించితిని. తెలియనివానివలె పుస్తకమును గూర్చినయంశములన్నియు నడిగెదఁగాక (ప్రకాశముగ) పడఁతీ! ఆగ్రంథనామమెయ్యది? నేనెందేనిచూచియున్నఁ జెప్పెద. తెలిసియున్న కవిపేరుఁ గూడఁజెప్పుము.

నటి-నాయకా! మీమాటలంబట్టిచూడ నా పాత్తము మీరె తీసిరన సాహసించుచున్నాను. దయచేయుఁడు. దయచేయకున్న నామీఁదయాన.

సూత్ర-నతీ! వచ్చిన దొంగతనము రానెవచ్చినది. గ్రంథమును దీసియున్న నొసంగెద. ఒకముద్దిచ్చెదవా? కవిపేరుచెప్పెదవా?

నటి-ముద్దెయొసంగెద. గ్రంథము తెండు.

సూత్ర-ముద్దులకేమికాని కవిపేరుఁగల పద్యము నొక్క దానిఁజదివిన పుస్తక మొసంగెద రాగయుక్తముగఁ జదువవలయును.

నటి-తప్పక యొసంగుదురు కద! ఈయకున్న నొట్టు. ఇదిగోపద్యముఁజదివెద. పుస్తకము బయటనుంపుఁడు.

సీ॥ అభినవపాండవీయంబను భారత
నాటకరాజమొనర్చినాఁడ
శృంగారరసపద్యసంగతంబగునట్లు
శృంగారతిలక మాంధ్రించినాఁడఁ
గ్రూరకర్మరులకు గుండెదిగుల్ల యా
వననిగర్వాణమును వ్రాసినాఁడఁ

బలుకు పల్కునఁదేనెలొలయ ముద్దుగఁగైతఁ
జెప్పువాఁడను పేరుచెందినాఁడఁ
గీ॥ బద్మనాయక కులసముద్భవుఁడఁగోట
గిరిసువంశ్యుఁడ వేంకటకృష్ణరాయ
కవిని యీపాదుషా పరాభవము వ్రాసి
నాఁడ చేకొనుఁడయ్య విజ్ఞానులార॥

సూత్ర-ఇఁక నొక్కమాటఁజెప్పినఁ బుస్తకమొసంగెద.

నటి-నాయకా! నాయుత్సాహము భంగపెట్టకుఁడు. మీరు కోరు పద్యము జదివెద నొసంగుఁడు.

సూత్ర-అటులైన నీకవిఁగూర్చియున్న పద్యములలో నింక నొక్కదానిని జదువుము. పుస్తకము తప్పకయొసంగెద.

నటి-ఈమారొసంగి తీఱవలయును.

ఉ॥ భారతనాటకంబు రసబంధురశైలినివ్రాసి, "కైతలో
నేరుపుఁజూపినాఁడ," నని నెమ్మదిఁ దృప్తివహింపఁబోక యీ
భారతమాత పైఁగలుగు బత్తిని వేఱొక నాటకంబు చె
ల్వారఁగఁ జేసినాఁడ బుధులార! గుణంబుల స్వీకరింపుఁడీ॥

సూత్ర-ఇఁకఁజెప్ప నవసరము లేదు. ఈకవిరాజును నేనెఱుంగని వాఁడనుకాను.

మ॥ తెలుఁగున్ సంస్కృత మాంగిలేయమును ముందే నేర్చి తర్వాతప
ల్కులలోనన్ రసమొల్కు నిర్మలవిధిన్ గ్రొంబొత్తముల్ వ్రాయు గం
పల గూడెంపుఁగుమారరాజునొకో భామా? క్రొత్తవానిన్ బలెన్
దెలియన్ జెప్పితివేనెఱుంగ నొకో? తద్ధీచాతురిన్ జాలిఁకన్॥

సూత్రి-నీవు చెప్పినదంతయు నేనెఱింగియున్న విషయమె. అభినవపాండవీయప్రదర్శన వశమ్మునసభ్యులుఁగూడ నీవిషయమెఱింగి యున్నారు. మఱియొక క్రొత్తపద్యమును జదివిన పొత్తమొసంగెద. ఈమారు బొంకిన కులమునకుఁ దప్పినట్లు.

నటి-గ్రంథము దయచేసిన జదివెద.

సూత్ర-(పుస్తకమిచ్చుచు)చదువుము.
నటి-నాపనితీఱినది (పోఁబోవును)
సూత్ర-(కొంగుఁబట్టికొని) పద్యమును జదివినఁగాని పోనీయను.
నటి-ఒక్క-పద్యము సూత్రనుచదివెదను.

కవిరాజవిరాజితము.

నవనవ పల్లవ•న్రమ లతాచయ • నైగనిగీ గవి • నాయకులు
త్సవముగఁగన్గొని•చామలవా తెలు•సామ్య మటంచును•పాటఁగ"నౌ
నవు" ననురీతిగ • న్రామమహీజశి • ఖాగ్రమునందున • నయ్యదిగో
చెవులకుఁ బండువు • చెందఁగఁగోయిల•చేడియపాడెడిఁ•జిత్రగతిన్॥

సూత్ర-ఆహా! నీగాన మెంతశ్రావ్యమైనది (సంతోషవశమునఁ గొంగు
విడచును) (నటిపోఁబోవును)సతీ!ఒక్క-మాట పోకుముపోకుము
నీచేతనున్న యీ పాదుపాపరాధవమే యిపుడు ప్రదర్శింపఁబోవు
నది. పాత్రలసిద్ధము చేయుము. ఇంతకంటె రసవత్తరమగు
నాటకము మనకు లభి పఁజాలదు.

నటి--(తిరిగిచూచి వెడలిపోవును)

సూత్ర-అకటా! వృథాప్రసంగముతో నెంతయో కాలహరణ మొనర్చి
తిని. ఇఁకఁదడయరాదు. నేను రాజసింహపాత్ర స్వీకరింపవలసి
యున్నది. ఇఁకఁ బోయెదఁగాక.

• ఇది ప్రస్తావన •





శ్రీమత్పర దేవతాయైనమః

# పాదుషా పరాభవము.

## ప్రథమాంకము.

(రాజసింహుఁడు డీదిగువపద్యమును జదువుచుఁ బ్రవేశించుచు)

మ॥ అరరే! యియ్యవురంగజేబు నిజబా • హాశౌర్యవిస్ఫూర్తి దు
ర్ధరదోర్వీర్య పటుప్రతాప రజపూ • తఖ్యాత సద్వంశ్య సం
గరవిద్యామహిమా ప్తికీర్తి జడిసి భ • గ్నంబందు నీహూరి ని
ర్జరసంతానన మేతులై హరిహర • బ్రహ్మాదు లడ్డైనన్॥

కట్టా! ఈభరతఖండ మీతురకలవలన నెంతయుల్లకల్లోల మగుచున్నది. వీండ్ర దుర్మార్గముం దలఁచుకొని భారతమాత యొతదుర విల్లుచున్నదో?

సీ॥ హిందూమతంబుల నీర్ష్యతోఁ గనినారు
కోవెలలను బడఁగొట్టినారు
పరకాంతలను జెఱఁబట్టి పైకొనినారు
పట్టణాలఁ దగులఁబెట్టినారు
బాటసారులసొమ్ము పగలె దొంగిలినారు
చెలరేఁగి దోఁపిడుల్ చేసినారు

చలమార హైందవజనులఁ గూలిచినారు
భరతవర్షము పాడుపఱచినారు

తే॥ గీ॥ తఱిమితఱిమి విప్రవరుల దొరకువఱకు
నఱకినార్కటఱకు మొఱక తురకలరరె
వేఱువేఱుగ నివి నిరూపింపనేల
చేయఁగలయంత దుష్కృతిఁ జేసినారు॥

అక్కటా! రాజపుత్రుల పౌరుషానలను చల్లారకమున్నె వీర పురుషుల రక్తధారలు దేశసంరక్షణార్థమై భూభాగమునఁ బ్రవహింపక మున్నె భరతమాతా. నీకెంతటి దురవస్థ తటస్థించినది.

సీ॥ సత్యవ్రతాచార సరణి నిన్నాహరి
శ్చంద్రుండు ప్రేమతోఁ బాఁకునాఁడు
పావనపితృవాక్య పాలనోద్యద్వృత్తి
శ్రీరామనృపుఁ డుద్ధరించునాఁడు
ధర్మంబు నాల్గుపాదంబులతో నడ
పించి ధర్మజుఁడు మన్నించునాఁడు
వెలమవీరులు బాహుబలశౌర్యమహిమంబు
నను వీరమాత నొనర్చునాఁడు

తే॥ గీ॥ విని యెఱుంగని బాములు కనఁగనయ్యొ
తురకతేఁడులు యేల్బడి తుదకునీకు
భారతీయుల దురదృష్ట వశముచేత
భవ్యసుగుణసమేత యోభరతమాత॥

హా! హైందవ యోధులారా! హా రాజపుత్రులారా! హా భార తీయులారా! దేశానర్థము సమీపింపనున్నది. ఇది యుపేక్షించయొనరింప వలసిన సమయముకాదు. యనవగార్జన్యముచే మనగౌరవము లంత రింపకమున్నె జాగ్రత్తపడుఁడు.

సీ॥ తలఁపకుంగురుసుమా ధార్తరాష్ట్రశత సం
హారుఁడౌ భీము బాహాబలంబు
మఱచిపోకురుసుమా హరునినిర్జించిన
శక్రతనూజు పరాక్రమంబు
స్మృతిఁ దప్పెదరుసుమా శ్రీహరినోర్చిన
భీష్ముని దుర్వారవిక్రమంబు
నిల్పకుంగురుసుమా నెమ్మదులందుపా
ర్థాత్మజు ఘోరశౌర్యాతిశయము
తే॥ గీ॥ సమయమే తెంచుచున్నది క్షాత్రమునకుఁ
బదనుఁబెట్టుఁడు మీకరవాలములకు
జన్మభూమికి మేల్సేయ జంకవలదు
ధరకు మనముగతించినఁ గొఱఁత లేదు॥

జోధపుర యువరాజ దుర్మరణ కారణభూత పాపాకర పాదుషా నావంశవృక్షము కూఁకటివేరుతోఁ బెకలించువఱకు దివ్యమహిమాసన్న సామాన్య హైందవదేవతా స్వర్ణవిగ్రహంబుల మసీదులకు సోపానంబులుగ నమర్చిన నీచమ్లేచ్ఛకులుల తలలఁ దోరణంబులుగఁ గోవెలల నలంకరించి దైవతపునఃప్రతిష్ఠఁ గావించువఱకు గోవధాది వివిధానేక కలుషభూయిష్ఠ సేతుశీతనగ మధ్యభూమండలంబు శత్రుకళత్రముల యశ్రుధారాసరిజ్జాలములచే శుభ్రపఱచువఱకు సర్వసంఘదురాచార నిర్మూలనముఁ గావించి సమస్తశాస్త్రాభివృద్ధి నొనర్చి భరతవర్షమునకుఁ బూర్వోన్నత్యము సమకూర్చునఱకు మనము మగువలుగ భావింపఁబడుదుము గాని మగవాండ్రుగా భావింపఁబడుదుమా? లెండు. లెండు. భారతీయులారా! లెండు. లెండు. శత్రుప్రతాపాగ్నిహోత్రము సజకోదండ విముక్త శరవర్షశరములచే జల్లార్చి విరోధుల

క్రౌన్నెత్తురుచే భూత ప్రేత పిశాచీగణసంప్రీతిఁ గావింపుఁడు. మాతృదేశక్షేమార్థమై వెనుదీయవలదు. జీవితములు క్షణభంగురములు. సత్కీర్తియె స్థిరము.

ఇయ్యరణ్యంబున యవనులు దోఁపిళ్లొనర్చుచుండిరనివినివాంధ్ర శిక్షింపదేశసుఖార్థినైవచ్చితి. ఎంతమాదినిఁబట్టి నెట్టుచున్న నిరుకపాతర వలెఁ దఱఁగకుండిరి. స్వదేశీయులందఱు దేశాభిమానులైన నీచోరులచే మనమువంచింపఁబడము (ముంగునకుఁజూచి) అదిగో దోఁపిడిగాండ్రు వచ్చుచున్నటులున్నది. రాజసింహుఁడు కంఠగతప్రాణుఁడై యుండువఱకు దుష్టశిక్షణము శిష్టరక్షణమునందప్రమత్తుఁడై యుండఁడు.

(నేపథ్యమున)

ఈదినాన్కినీదిప్రాణంపోయిందీ సూడ్. మాకిచిక్కక యేడిపిచ్చావు నీకీ యెంశేసినా పాపంలేదు. అక్కడావుంతూ నీకి సంపియేపిస్తాను.

(అనుచు దోఁపిడిగుంపొకటి రాజసింహుని చుట్టుముట్టును)

రాజ- (ఖడ్గమొఱనుండి పెఱికి)నాబాహుబలము మీకుఁ జూపనదను వచ్చినది.నిల్వుఁడు.నిల్వుఁడు

మ॥ అరరే! నీచతురుష్కులార!నను మీరా గెల్చువారౌర!దు
ర్భర లోకోత్తర రాజసింహ సముదగ్రస్ఫూర్తిఁ గన్పట్టనే
ర్తురు రారండిఁక మీకెకాదు రసవృత్తుందాఁకి గెల్పొందఁ గి
న్నరగంధర్వ సురోరగాదులకు నైసర్గ శక్తి పూజ్యంబహో॥

(అని మీఁదికుఱుకుచున్నాఁడు)

(దూరమున)

పద్మా!పద్మా! లెమ్ము లెమ్ము చూచితివా!దుర్మార్గము.ఉదయపురాధిపు నొక్కనిం జేసి తురకదోఁపిడికాండ్రనేకులు పైకొనుచున్నారు. లెమ్ము లెమ్ము పోదము రమ్ము.

(పురుష వేషములతో ఖడ్గములఁదాల్చిపద్మయువిమలయుఁబ్రవేశింతురు)

విమ-(కోపముతో) ఓదొంగలారా! మీ శాసన్న కాలమువచ్చినది.

ఉ॥ ఓరిదురాత్ములార! యొకయోధుని పెక్కురు తాఁకినారమీ
పౌరుష మింతయౌను మగవారలు కారె? విరుద్ధయుద్ధమె
వ్వారలుమెచ్చుకొందు రిటువచ్చి తలంపడి యొక్కఁడొక్కఁడే
పోరినచో జయాపజయముల్ సముసంబునఁ దేల్తుఁ జూడుఁడీ॥

కానిండు. మీరెంతమందియున్నను మమ్మేమి కావింపఁగలరు? కురంగార్భకమని వేఁటకుక్కలవలెఁ బైకొంటిరి. కేసరికిశోరమని యిప్పటికేని భావింపుఁడు.

(అని పద్మాసహితముగ రాజసింహునకుఁదోడ్పడి దోఁపిడికాండ్రను విమల చెల్లాచెదరు గావించుచున్నది)

రాజ-(విమలనుద్దేశించి) ఓ రాజపుత్రికులతిలకా! ఒంటరినైననన్ను గోమాంస భక్షకుల బారినుండి కావ పౌరుపరుగున నేతెంచి స్వకార్యమట్లుల నన్నుంగూడి తురకలఁ దఱిమితివి. ఇందులకు నేను జన్మాంతము కృతజ్ఞుఁడను. ఈదినమునుండి నన్ను మీస్నేహితగణములోఁ జేర్చికొనుఁడు.

చం॥ తురకలఁ బారఁదోలి దయతోఁదిలకించితి వీవు కాన నుం
గరముఁగృతజ్ఞతన్ దెలుపఁగా నిడుచుంటిఁబరిగ్రహించి లో
మఱువక రాజసింహుఁడనుమాటచు, నీహితబృందమందునన్
బరిగణనమ్మొనర్చి స్వజనంబులలోన నన్ గ్రహింపుమా॥

(అని తన వ్రేలియుంగరము విమలవ్రేలికుంచి స్పర్శసుఖ మనుభవించును)

(స్వగతము) అయ్యారే! ఆశ్చర్యమాశ్చర్యము. ఏమియీశరీర సౌకుమార్యము. నాకీవ్యక్తి శరీరవచోమార్దవములం బట్టియు, నింతకుమున్ను "పద్మావే" యను స్త్రీవాచకసంబోధననుబట్టియు,నిండు జవ్వనమునుండియు, నూనూఁగుమీసము లేని లేనికారణమువలనను మగవాఁడనుటకు సందియమగుచున్నది. రెండవవ్యక్తి యెపుడుపద్మా యనిపిలువఁబడెనో యపుడె స్త్రీయని భావించితి. ఐనను వీరిరువురి

నిజస్థితిఁగనుఁగొన యత్నింతును (ప్రకాశముగ) నెచ్చెలులారా? తమ పేరు లెవ్వి, కులమెయ్యది? ఈఘోరారణ్యమునఁ దిరుగం బనియేమి. మీ యూరేది యని నేనడుగవచ్చునా?

విమ- (నిరుత్తరమై నిలచియుండును)

పద్మ- మేమురిసపుత్త్రికలము. ఈయరణ్యమునకు మృగయావినోదార్థమై యేతెంచి యలసి యుద్యానప్రాంతముల విశ్రమించియుండఁ దుర కదోఁపిడీకాండ్ర యార్భాటములను దనుపీర వాక్యములను విని దేశోద్ధారకులగు తమకుఁదోఁడైతిమి. నివాసస్థలములు నామములు కారణావసరములంజెప్పరామి గుప్తపఱచితిమి. అయినను వానితోమీకేటియవసరము. అవసరమైనపుడు మేము చెప్పకయే యెఱుంగఁగలరు.

రాజ- ఓహో! కడుచక్కఁగా వచించితిరి. నాప్రాణదానముఁ జేసిన మీనామధేయాదు లెఱుంగకుండుట నాకు శ్రేయస్కరమా?

పద్మ- ఔను. మాయుదంతము తెలిసికొనకుండుట మీకు శ్రేయస్కరముగాదు. తెలుపుట మాకును శ్రేయోదాయకము కాదు.

రాజ- అయ్యో, ఇదియెక్కడి యన్యాయము. ఎవరిపేరువారు చెప్పికొనిన ముప్పేమి?

పద్మ- ముప్పె యగును. అది మీకనుభవము లేదు.

రాజ- సరి! ఈప్రసంగమునుబట్టి మీపురుషత్వముపై శంక పొడము చున్నది.

పద్మ- (కోపమునటించి) సరి సరి లెండు మేముబలలమనుకొంటిరా? కామాతురులగు మీకు మేమట్లు పొడకట్టుదుమా?

రాజ- పేరులఁదాఁచికొనుట మీతప్పైనను దూషణము నాపాలఁబడి నదేమికర్మము. ఎవరినో యేమో చేయఁబోవ నెమోయయ్యె నఁట.

పద్మ- అగును. ఎవరికివారే యట్లనుకొనుచున్నారు.

రాజ- (స్వగతము) వీరల నిట్లడిగిన నెట్లని నిజవర్తమానము వా

కొనరు. కావ నేనేగునటులనటించి యీప్రాంతములఁబొంచివీరల సంభాషణములవలన గుర్తింపవలనైన గుర్తించెదఁగాక. (ప్రకాశముగ.) మీ యుదంతము సెలవీయకున్నను మంచిదె. నాకు సెలవిండు పోయివచ్చెద.

(అనినిష్క్రమించి రాజసింహుఁడు చెట్లచాఁటున డాఁగి యుండును)

విమ-పద్మా! ఇఁకవిశ్రమింతమురమ్ము.

(అనియిరువురుకూర్చుందురు)

పెళుసు పలుకులు పలికి వారినప్పుడె పంపితివేమే?

పద్మ-విమలా! ఆయననిష్క్రమణము నీకనిష్టమైన వెంబడింపరాదా ?

రాజ-(వెలికివచ్చి)సరియే నేననుకొనినరీతిగానే జరిగినది.వీరల పెరులంబట్టి యీఁడుతనముంగూర్చి వేతాడనేల? స్త్రీలని బోధపడుకొలఁది నామనమున నుత్సుకత్వ మతిశయమగుచున్నది. ఇంక నేమేమి పల్కఁబోదురో వినియెదఁగాక

(యథావిధిడాఁగుచున్నాఁడు)

విమ- ఏమే పిడువ కయ్యానఘుని వెంబడించుటకు నే నాయనఘునకు ఛాయాదేవినే.

పద్మ- ఔనౌనే. నేననునదియు నదియె.నీ వాయినునకు ఛాయాదేవివే

విమ- చాలు చాలు నీపెడయర్థములు. ఎట్లయిన నేమి. రాజసింహుని వంచించి పురుషులమనియే యొప్పించితివికదే. పాప మమాయకుఁడు నమ్మినాఁడు సుమీ.

పద్మ- ఆయన నమ్ముటయేమిలెక్క. నీకు మేనమఱఁదలనై నాజనని చనిపోయిననాఁటనుండియు నీకడకు రావింపఁబడి నీతో నొక్క కంచమునఁదిని యొక్క శయ్యనుబరుండు నేను నిన్నానవాలుఁ బట్టలేకుంటిని.మృగయావిహారమైనది. ఇఁకఁబ్రయాణముకమ్ము వేగ గృహము చేరుదము.

విమ- కూఁతపెట్టుదూరమున నున్నరూపనగరమున కెంతసేపేగవల యును. ఇంకను గొంతసేపీమలయమారుత మనుభవించియే

యేగుదము విశ్రమింపుము.

రాజ-(వెలికివచ్చి) ఈవ్యక్తుల ప్రథమదర్శనమున నే మన్మనోక్షేత్రంబున నాటఁబడిన మోహబీజము స్త్రీలా? పురుషులా? యని నాకుఁగల్గిన సంశయ పానీయప్రసారంబున మొలకయెత్తి యచిరంబున వీరి స్త్రీత్వనిర్ధారణాదోహదము చేయావనదశంగాంచి విమలాప్రియ సంభాషణాదరణంబునఁ బ్రస్తుతము పెనుమ్రానై దుర్భరమగు చున్నది. ఇమ్మహామోహభూరుహసంహారకార్యమపార విమలా ప్రణయదుర్వారనిశితకుఠారమునకుం దప్ప తదితరదుస్సాధ్యము. ఇబ్బాలికారూపాతిశయంబులు చక్షురింద్రియములు కనుచున్నను మనంబెఱిఁగియున్నను ఒక్కసారివర్ణించి మనస్సంతుష్టిం బొంది జిహ్వను జరితార్థము నొనర్చుకొనియెదఁ గాక.

ఉ॥ భృంగసమూహమీఁదు పృథువేణికిఁ, గన్నవతోడజోడు సా
రంగచయుమ్ము, మోమునకు రాత్రిచరుఁడగుఁదోఁడు, మత్తమా
తంగము లోడు యానమునఁ, దన్వి నుతింపఁగ నేల వేఱు స
ర్వాంగవిలాసభాసురతరంబుగ ధాత సృజించె నద్దిరా॥

నేనింకఁ దడయ నేల. తిరిగి ప్రత్యక్షమై నాపురాకృతఫల మెట్లున్నదో యాలోచించుకొనియెదఁ గాక.

(అని ముందునకు వచ్చును)

(తనలో) అరరే! మూర్తీకరించిన చతుర్దశభువనైకసమ్మోహన మోహినీ మనోహరావతారమనఁ జాలు నీయమమూర్తి యెంతయొప్పియున్నది.

సీ॥ అనమలావణ్యమహాసముద్రమున జ
నించిన యగ్రమాణిక్య మనఁగ
యౌవనసాధనోద్యమలీల మరుఁడు వి
సరివైచిన వినూత్నశర మనంగ
భువనత్రయవిశేషముల నెల్ల నరసిపో
నవతరించిన యుమాయువతి యనఁగ

ధగధగద్ధగకాంతిఁ దయచేయు వర్ణనా
తీతమూర్తి గాంచుటఁగాఁ గె యనఁగఁ
తే॥గీ॥ పోఁతఁబోసిన బంగారుబొమ్మయనఁగ
నెమ్మివిహరించు వేలుపుకొమ్మయనఁగ
విమలసర్వాంగశోభతో వెలయు విమల
కరము గ్రహియింపకే బ్రతుకఁగ దరంబె॥

(ప్రకాశముగ) నెచ్చెలులారా! ఏలయీలీలవృక్షములమాటున కేగెదరు. వినుఁడా! నేనమూయుకుఁడను కాను కానఁ బొంచిపొంచి మీ ప్రసంగము విని నీవు రూపనగరాధిపుఁడైన విజయసింహుని కూఁతు వనియు నాయుమ నీవధూనికయనియు నెఱుంగఁగల్గితి. పద్మా! మొదటనే నాకాసంగతిఁ దెలియఁనీయవైతివేల? నన్ను గూర్చిమీరు మిమ్ముఁగూర్చినేను వినుటయెగాని యవలోకన మిదివఱకు లేదుగదా! మాఱువేసంబులతో నున్నందులకు లజ్జింపకుఁడు. యువతీమణులారా!
మ॥ మగవేషంబునుదాల్చి యంతిపురిభామల్ కానకేతెంచి శ
త్రుగణంబుల్ విదళించువార్త రిసపుత్త్రిండెవ్వఁడే న్విన్న మె
చ్చఁగలాఁడులతియకాని మూర్ఖతను "గోషావీడినా" రంచు దూ
రఁగరాఁ డియ్యది పూనినార్యవనదౌర్జన్యంబు వారింపఁగన్॥

విమ- (జనాంతికముగ) పద్మా! వినుటయేకాని పరీక్షించి యింతవఱకు నీయనను వర్ణింపలేదుసుమా. ఇంతకుమున్ను గూడఁగన్నారఁ గాంచనీయుక సిగ్గు నాకభ్యంతరమైనది. రాజసింహుఁడే కాదు పురుషసింహుఁడే.

పద్మ- (జనాంతికముగ) వగలాడీ! అపరిచితునకే బిరుములోసంగుచుంటి వీఁక వివాహమాడి సుఖపయోధి నోలలాడునాఁడెన్ని బిరుదు లొసంగెదవో.

విమ- (జనాంతికముగ) ఇంతకే యింతహాస్యమూ? దైవము చక్షురింద్రి యములఁ బ్రసాదించినాఁడుకాన సద్వస్తుసందర్శనము లభించి నపుడు బాగోగులు విచారించి సంతోషమును వెల్లడిఁజేయుట

మానవస్వాభావికము. దీనఁ దప్పేమి.

పద్మ- (జనాంతికముగ)ఎంతమాటకారివే. తావలచినదిరంభ తా మున్గినది గంగయనునట్లు భావించెదవు. వలపులో మాహాత్మ్యమే యిది. తామువలచినఁజాలు నవమన్మథలే.

విమ- (జనాంతికముగ) ఎందుకమ్మా యింతరాద్ధాంత సిద్ధాంతములు ఉన్నమాటయనినఁ దప్పైనది. ఇఁక మాటలాడిననొట్టు.

రాజ- చెలులారా! మనయింటికడ నందఱకు క్షేమమే కదా.

పద్మ- దేవా!విమలహృదయులైన రాజసింహ విమతభయంకరులు కలుగ క్షేమముకాకేమి.

విమ- పద్మా! అందఱిక్షేమమున కేమిగాని చంద్రావతిగతి యేమైనదో ఔరంగుని పంతమే చెల్లెనో కనుఁగొనుము.

రాజ- వీరయువతీ! చంద్రావతిగతికేమి?

మ॥ అతివా! లోకభయంకరోద్ధతిబలుండౌ రాజసింహుండు జీ
వితుఁడై యాయుధపాణియై నిలువ నేవీరుండు చంద్రావతీ
సతి పేరెత్తఁగలాఁడు? నీవెఱుఁగవో? సాహేబుగారిందు దు
ర్గతిపాలై రని నిక్కమెంచుకొనసాఁగఁ బోవు దుష్కార్యముల్॥

విమలా! చంద్రావతీయజితసింగులఁ గోటలో రక్షితులంజేసితి. దుర్గాదాసుని చెలియ లిందిరతప్ప పరులచేతి కెవ్వరుచిక్కలేదు.

విమ- (జనాంతికముగ)అయ్యో!పద్మా!చిక్కుటయనఁగానే నాకుభయమగుచున్నది.చంద్రావతికిఁ బుత్రశోకోపశమనార్థమై నే నౌరంగుని దత్సతినిదూషించుచు వ్రాసినలేఖ యేమైనదియుఁదెలలేదు, ఔరంగునిచేతఁబడియుండకుకదా! వానిచేఁజిక్కినఁగోపకారణమె

పద్మ- ఇప్పుడాసంగతి యెందులకు లేవమ్మా.

రాజ- (తనలో)

ఉ॥ కాంచమె కాంచనాంగుల జగంబున నెందఱనేని బాళిమో
హించమె? దీనిఁబోలెడి యహీనసురూపవతీలలామ న

భ్యంచితనూత్నయౌవనవిభాసుర నెన్నఁడుఁగాన దీనివ
రించినవాఁడెపోకవి వరించినవాఁడెకదా కృతార్థుఁడున్॥

ఈయమనమునోగతి నించుక కనిపెట్టెద. (ప్రకాశముగ) ఇఁక నానిశ్చయపుఁబోఁకడ కనుమతింతురా? నాకుఁ బనిశోందరలు కలవు.

పద్మ- ఇప్పుడైన జవాబుఁజెప్పవే

విమ- పద్మా! వారంత వేగిరపడుచుండఁగా నాఁపుట కెంతవారమే మనము.

రాజ-(తనలో) వేఱుగా నాపనక్కఱలేదు. మోహపాశసంబద్ధుఁడనై కదలమెదలలేకుండనే యుంటెని.

విమ- భూపాలా!(సిగ్గుతో) కార్యావసరమున నేగు మగవారల నాఁపఁగూడదు. ఆఁపినను వారుండరు. చెన్నను బాగుండదు. కాని మా ప్రార్థన యొకటికలదు. అదియెద్ది యుండు రేమో! చిత్తగింపుఁడు.

తే.గీ॥ పద్మ విమలయనెడు వారుఁ గలసిరంచు
నాకుఁదోఁచువచ్చి నారలంచు
జేకుతెచు రవంత చెలిమిగూడనటంచు
మఱచిపోఁకుండెదను మహితచరిత॥

రాజ-(సంతోషముతో) ఇంతకంటె నేనుమాత్ర మభిలషింపవలసిన దేదియుండును. నాకన్నిటను బ్రాణదాత్రివగు నిన్ను మఱచుటె ట్లు? (తనలో) ఈ యమ వచస్స్థితినిఁబట్టి ననువలచినట్లే కాన్పించుచున్నది. ధన్యుఁడనైతిని.

సీ॥ వాక్సతీగర్వవిభంగంబుఁగావింపఁ
గల్గు విద్యామహాత్కౌశలంబు
పల్కుపల్కునఁదేనె లొల్కుననన్యసా
మాన్యమా మధురసంభాషణంబు
నాపునంబెట్టియందంబుషైనభిలాషఁ
జెందునో యట్టిచక్కందనంబు

హరిహరబ్రహ్మాది సురవరసంతాన
దుర్జయవిక్రమస్ఫూర్జితంబు
ఆ.వె॥ కలిగి వెలయు విమలఁ గనులార వీక్షించి
భోగినైన మఱియు జోగినైన
ననమబాణుసుమశరాంభోదిమునఁగ
జనఁగనేర్చునఁట స్వప్న వార్త॥

(ప్రకాశముగ) కాంతామణులారా! నన్ను మఱువకనితలంతు. పోయిన చ్చెద.

విమ- పద్మా! ఇదియేమిచిత్రమే? వారేయనఁదగిన వారిముద్రికయే మన వ్రేలనున్న మఱితుమఁట. మన మనవలసినమాట వాఱనిరి సుమా.

పద్మ- దేవా! మాచెలి తనవదన వలగ్నము లీస్థితియందుంచువఱకు రాజసింహుల మఱచుటకు సందేలేదు.

విమ- (చిఱునగవుతో) ఎంతచమత్కారిణివే.

రాజ- ధన్యోస్మి ధన్యోస్మి. అబలలారా! ప్రవేళకేమో. ప్రగెడివాఁడ నేగు చున్నాఁడఁగాన నియ్యగణ్యము దాఁటువఱకు నేను సాఁగనంపుట శ్రేయస్కరముకాదా?

విమ- పద్మా! వచ్చునపుడు మనకెవ్వరు తోడైరి.

రాజ- [తనలో] హాయి. ఇట్టిసమయమందేని యొక్కముద్దునకేని నోఁచుకొననైతినా? కానిమ్ము కార్యార్థికిఁ దీవ్రముండరాదు. (ప్రకాశముగ) విమలా! ఇఁక నాకనుమతి నొసంగితివా? అఘటనఘటన సమర్థుడగు భగవంతుఁడు మనకచిరమునఁ బునస్సమాగమసౌఖ్యంబుఁ బ్రసాదించుఁగాత.

పద్మ- తథాస్తు- తథాస్తు.

విమ- [తనలో] వదినా! నీమాటలు వేదవాక్యములగునట్లు దైవ మనుగ్రహించుఁగాక.

రాజ- మిమ్ము నేనెడఁబాయుటకు మనమొప్పకున్నను దడయరాదు. నాకు సెలవిండు. [అనినడచుచున్నాఁడు విమలయుఁ బద్మయు వెంటనడచుచుందురు] ఇఁక మీరాఁగుఁడు.

పద్మ- చిత్తము సెలవు.

రాజ- ఆయురైశ్వర్యాభివృద్ధిరస్తు.

విమ- (అనలేకయనలేక హీనస్వరముతో) భృత్యురాలు సెలవు వేఁడుకొనవచ్చునా? [అని మ్రొక్కును.]

రాజ- (నవ్వుచు) సతీ! భవన్మనోభీష్టార్థసిద్ధిరస్తు. (ముందునకుఁ బోఁబోయి)

తే-గీ॥ జంపుతగదిందు కార్యావసరము కానఁ
గదలిపోవుదమా? యనఁ గాళ్లురావు
కటకటా నాదు మదియను గాలిపడగ
వలపుదారాన నాడింపఁగలిగె విమల॥

ఏమైనను బోవకతప్పదు(అనినిష్క్రమించుచున్నాఁడు)

విమ-(తనలో)నాథా! "సతీభవన్మనోభీష్టార్థసిద్ధిరస్తు"అను నీయాశీర్వాదమును తెప్పయే నన్నీ వియోగజలధినుండి దరిఁజేర్పఁగలదు.

పద్మ- (దృష్టినిగిడ్చి)విమలా! చూచితివే. రాజసింహాసైంధవంబప్పుడే యెంతదూరమున కేగినదో?(విమలనుజూచి)అయ్యో!ఆయనతో నీమనోరథముకూడఁ బోవుచున్నట్లున్న దేమే.

విమ- వధూనికా! చన కేమున్న దే. రాజసింహకలంకముక్తవదనసుధాకరబింబనిష్క్రమణానంతరము మన్మనఃప్రపంచము విరహాసాంద్రాంధకారచ్ఛటావృతంబయ్యె. ఇంక నాజీవితము నిష్ప్రయోజనము.

సీ॥ ఆనవకోటి బాలార్క తేజోనిధిఁ
గన్నారదర్శించు కనులు కనులు
ఆనిర్జరాపగానూన సమానధై
ర్యస్థైర్యుఁ గనసిన రమణి రమణి

ఆనిర్మలాస్యసుధాంశు నధరపాన
శేముషిందనరారు జిహ్వ జిహ్వ
ఆనిత్యసత్యవ్రతాచారు వాక్సుధా
శ్రీనందఁజాలిన చెవులు చెవులు
తే॥గీ॥ ఇట్టినై భవలీలలే నెప్పుడంది
సౌఖ్యజీవనంబును గనఁజాలుదాన
నామనోనాథు పదసేవనాకుఁ గఱవు
తీఱ లభియించునెన్నఁడో తెలియఁ దరమే॥
వదినా! వదినా! ఇఁక నాయాస వదలుకొనుము.
[అని పద్మపైనొఱఁగును]
పద్మ-అయ్యయ్యో! విమలా! కన్యక కీవిచారమేల? నీవింతటనైనసత్య
నఘుని మఱచిపొమ్ము. లెమ్ము పోవుదము రమ్ము.
విమ- రాజసింహునా నేనుమఱచుట.
సీ॥ శరణాగతత్రాణ బిరుదాంక యూతంను
జనియింప జనియించె ననఁగవలయు
ఉగ్గుతోఁబోసినారూర్జిత నిర్వక్ర
పౌరుషాది క్రియాపాటవముల
అసమానసత్యవ్రతాచార పారీణతను
సత్యనఘుఁడు పెట్టినది పేరు
సౌందర్యశేముషీసందర్భమున వానిఁజెప్పి
వేఱొక్కనిఁ జెప్పవలయు
తే॥గీ॥ నిట్టియద్వితీయపురుషు నెట్లు మఱతు
మఱతునన్నను గలనైన మఱపు రాఁడు
పట్టుటొండె యత్నికాక గిట్టుటొండె
యొండు తెఱవులే దింక నా కూహఁజేయ॥
పద్మ- (తనలో) అహహా! లోకమంతయు నసమశరునిచేతి కీలు
బొమ్మయె కదా! అయ్యైంద్రజాలకున కిసాధ్య మొకటి కలదా?

త్రినేత్రునే వశపఱచుకొనిన వానికీపాటిబోటి యొకలెక్కయా?

విమ- శూనాస్త్రా! నీబోటిమేటికి బోటులనేచుట పాడియా?

సీ॥ కన్నతల్లిగుణంబు నెన్నితిమా? యొక
స్థలమున నిలువనిచపలచిత్త
జనకునిమాట విచారింతుమా? చెప్ప
రానియంతటివిటరాయఁ డతఁడు
మేనమామ గుణవిధాన మూహింతుమా?
గురుకాంతఁ బొందినక్రూరమూర్తి
త్వత్సహోదరుఁ గూర్చి భావింత మందుమా?
వాఁడొక్కనాలుకవాఁడు కాఁడు
తే॥గీ॥ అహహ నీచాలుసాంప్రదాయంబు లెన్న
నిట్టులైయుండ సద్గుణం బెట్టులమరు
గులకఱాలగనిం గాంచఁగలమె? కెంపు
నమరఁగాఁగలదొక్కొ? శైత్యగుణ మగ్ని॥

వదినా! కుసుమసాయకబాణజ్వాలాపరితప్తంబగు మత్తనువల్లికయందుఁ బ్రాణమున్నట్లు పొడకట్టకున్నది. నాసంతాపము దుర్ధరము దుర్వారము. హాతోస్మి. హాతోస్మి.

పద్మ- (తనలో) కానికార్యము తటస్థించినది. ఈయమనెట్లోని మఱపించి యిల్లుఁజేర్పవలయును. మితిమీఱినవిరహజ్వరార్తురాలగువిమల నెట్టులోదార్పఁగలను.

విమ-

సీ॥ నగుమోముఁగలవానిసొగసుప్రాయమువాని
మేలునూనూఁగు మీసాలవాని
కలువకన్నులవానిఁ గళలఁగుల్కెడివాని
మేలిమిబంగారు మేనివాని
రిపులఁగూల్చెడివానిఁగృపమదిఁ దగువాని
స్వామితరతుణశక్తి వరలువాని

వెడఁదయురమువాని పేరు కెక్కినవాని
నంగనానంగుఁ డైనట్టివాని

తే॥గీ॥ రాజసింహుఁ డనెడి నృపు రసికుఁ గూర్చి
నన్నుఁ బ్రోవరె? పేర్మి గంధర్వులార
గరుడకిన్నరయక్షకింపురుషులార
సూర్యచంద్రాదులార సుశ్లోకులార॥

పద్మ- చాలుఁగాని యిటుచూడుము. విమలాంభోరుహ హృదయసంతాపమునకుఁ జింతించుచు విధిలేక యినుఁడు నిష్క్రమించె. వేగిరపడుము. అశ్వారోహణ మొనరింపుము. వేగనిలుఁ జేరకున్న మామగారాగ్రహింతురు లెమ్ము.

విమ- పద్మా! పోవుదముగాని చూడుము. చూడుము.

సీ॥ రాజీవసంతతి రంగుఁదోలంగ న
నంగుండు హుమ్మని చెంగలింప
జలధిసమూహంబు చంకలు తాటింప
ధనికులౌ వైశ్యులు తల్లడిల్ల
సింహశార్దూలాదిజీవాళి మేల్కాంచ
ఘూకరాజంబులు గూండ్లవదల
హాలికులెల్ల గృహములకు వెడలంగఁ
బాంధులు మదిలోన భయమునొంద

తే.గీ॥ నీలిమమున దిక్తటములు నిండిపోవ
సతులెదురుఁజూడ రానున్న పతులకొఱకు
తిరిగిచూచుచు పద్మినీతరుణిని విడ
నేరక తుద కినుండు తా నిష్క్రమించె॥

పద్మ- విమలా! నీ వెంత ప్రౌఢవే? నీవు చదివిన పద్యమునకుఁ జగణాదియందు "రాజసింహా నీసతినే", యని చక్కఁగ నిమిడ్చితివి.

విమ- (సిగ్గుతో) నీవు నామాటలకన్నింటి కర్థాంతరముఁ గల్పింపఁ గలవు కాని యుద్దేశము మాత్ర మది కాదు. [కొంచెమాగి]

అప్పుడేచూతుము.

స॥ అతివిస్తారతరక్షుభాక్షుభితమహారణ్యాజీవౌఘసం
వృతమై ఫూత్కృతదుర్విషానలమహాభీమోరగానీకసం
గతమై, ఘోరకఠోర బాహుబల దుర్గర్వాంధదైతేయసం
భృతమై యియ్యటవీస్థలంబు వెలసెన్ పృథ్విన్ జనాగమ్యమై!

పద్మ- కానసే వేగిరపడుము.

విను- ఇదియేకదా మనయూరు. అశ్వములు కలవు. తెప్పపాటునం జేరఁ గలము.

పద్మ- ఎందున కీవృథాసంభాషణము. ఇదియరణ్యము. అందు రాత్రి కాలము ఔరంగుని పరిపాలనము. ఎంత వేగముగ మనము చేరఁ గల్గిన నంతసుఖదము. పోవుదము రమ్ము.

(ఇరువురు నిష్క్రమింతురు)

ప్రథమాంకము.

సమాప్తి.



శ్రీమత్పరదేవతాయైనమః.

# పాదుషా పరాభవము.

## ద్వితీయాంకము.

[రంగము. ఢిల్లీలోని పాదుషాగృహము.]

ఒకహిందూసేవకుఁడు ప్రవేశించును.

సేవ- ఛీ. ఛీ. ఈతురకలసేవ భూలోకనరకము. వీండ్ర హైందవులు మొదలె కొలువరాదు. ఔరంగునికొలు వెవరికైన నపాయకరమె. అందీతఁడు హైందవులపైకసిన నుల్లివిత్తువలె లేచును. బ్రతికిన బలుసుకూరయైనఁ దినవచ్చుఁ గాని యీ చాకిరి కడుంగడు కష్టము. కదలినకోపము. మెదలినతిట్లు. ఓఁయనినదన్న. ఆఁయనినశిక్ష. మాటమాటాడిన శిరశ్ఛేదనము. ఈనౌకరి దినగండము నూరేండ్లాయుష్షువలె నున్నది పోనిమ్మన్న నౌకరికి విముక్తిపత్రము నొసంగుచుమా యనిన వీలులేదు. ప్రవేశించుటయే మనయిష్టము. ఊపిరివిడచుటయే కష్టము ఎంతకొద్దితప్పునకైనను క్షమార్పణము లేదు. నా కర్మమీలాగున కాలినది. చావనా. చేసికొన్నందులకుఁగాచి పోయక తీఱదనినట్లు బుద్ధిపూర్వకముగాఁ బ్రవేశించినందుల కెంతకష్టమైన నీనౌకరిఁ జేయుకతప్పదు. ఈపీడాకరపురాజు పోయిననాఁడే భరతఖండము బాగుపడుట. నాకెందులకీగొడవ. ఎవరేని వినిన ప్రాణాంతకము. అంతఃపురపుగోడలకుఁ గూడఁ జెవులుండునందురు ఇంతయేల ఔరంగజేబేదియో యొకయుత్తర మిచ్చి తనభార్యగారగు నుదయపురిబేగాముగారి కొసంగి

రమ్మనెను నే నాలసింపరాదు. నాపనిఁ దీర్చుకొందు. అప్పటికి నానెత్తిపైఁ గలబరువుఁ దీఱఁగలదు.

(నిష్క్రమించును)

(అంతఃపురమునుండి యుదయపురి ప్రవేశించును)

ఉద- పరుగిడలేక నాదుష్టు బలాదూరమనట్లు ఔరంగజేబు చెట్టఁబట్టఁదనుక సాధ్యమైనందున నెందఱో రసపుత్రస్త్రీలు ఉదయపురి రాజవంశమున జనించియుఁదురకను గట్టుకొని మన కులమున కపఖ్యాతి నార్జించెనని యేడ్చిన నాకేటిలోటు. తమ లేమికి దుఃఖింపనొక నేత్రము ఒరులకలిమికి సుఃఖింపనొక నేత్రము గ్రుడ్డియైనట్లు వారియోర్వలేమితనము ఫలము వారే యనుభవింతురుగాక. ఆబాల్యమునుండియు నేనొక రాణిననిపించుకొనవలయునని తలంచుచుండెడిదానను నేఁటికది యొనగూడె. ఇంతయేల. తనయులెందులకు, తల్లిదండ్రుల సుఖపెట్టుటకుఁగాదా? నేను పాదుషాభార్యను కాకున్న నాతల్లిదండ్రులు మునుపటివలె కూటిపేదలై యుండక జాగీరులందఁగలరా? "ధనమూలమిదంజగత్" అందురు కాన ధనవంతులకులోటేమి. ఔరంగునికర గ్రహణము నాకు సర్వవిధముల శ్రేయస్కరమె. చాటుచాటున నోరుపులేని కుక్కలేమియో మొఱఁగిన నాకేమిలెక్క. అదృష్టమన్న నాయది కాక యింకొకరిదా? ఇదివఱకు నాచే మ్రొక్కలందుకొను రాజస్త్రీలచే నిపుడు మ్రొక్కలందుకొనుచుంటి. వహ్వా! యింకేమి కావలయును.

సేవ- (ప్రవేశించి) దేవీ! తాను వచ్చులోపల నీయుత్తరమును దమరు చిత్తగించి యందలిసంగతులు తనకు మనవిఁ జేయవలసియుండునని చెప్పి యవురంగజేబుగా రొసంగిరమ్మనిరి (అని యొక యుత్తరమిచ్చును).

ఉద- (అందుకొని) సేవిక వెళ్లవచ్చును.

(సేవకుఁడు నిష్క్రమించును)

(ఉత్తరముఁ జూచి) యీ యక్షరనైపుణిం బట్టిచూడ నీలేఖ యెవ్వతెయో స్త్రీ వ్రాసినరీతిగాఁ గన్పట్టుచున్నది. ఎవరు వ్రాసిరో సాంగముగాఁ జదివిచూచెదఁగాక (అని చదువునట్లు నటించును).

ఓహో! ఈకమ్మ రూపనగరాధీశుఁ తనయయగు విమలచేఁ బుత్రిమరణశోకోపశమనార్థమై చంద్రావతికి వ్రాయఁబడినదానివలెఁ గన్పట్టుచున్నది. ఐనను సాంగముగఁ జదివెదఁగాక. (చదివి.) (కోపముతో) ఏమీ! దీనిపొగరు. తనయంతర మేమి? నాయంతర మేమి! యేనుఁగెక్కడ! దోమ యెక్కడ! నక్కయెక్కడ! నాకమెక్కడ! తానెక్కడ! నేనెక్కడ! తానెంత! తనభాగ్యమెంత! తనవంశమెంత! తనశీలమెంత! తనశక్తియెంత! నన్ను దూషించుటయెంత! నన్నే! నన్ను! ఉదయపురీ మహారాజ్ఞినే! శత్రుభయంకరుఁడగు పాదుషాహా అర్థాంగినే-అనన్యసామాన్యకార్యాకార్యనిర్వహణవిద్యావతినే దూషించెగా (మరల జాబుచూచి) నేనఁట. తురకను గూడియుఁట క్షత్రియులకఁట అపఖ్యాతి నార్జించితినఁట! అబ్బా యేమే నీపతితపావనత్వము. ఓసీ. ఇట్టి నేనే నిన్నొకమహమ్మదీయున కంటఁగట్టి నీచే విడెమందుకొనఁజాలకున్న పాదుషాకు అర్థాంగినికాను. ఈ స్త్రీవ్యక్తిశక్తియుక్తులు వ్యక్తమగుదినములు సమీపించుచున్నవి. గర్వాత్ముగాలా! దుర్విదగ్ధురాలా! విమలానామధేయులారా! నీకుఁబోఁగాలము దాపరించినది. నీలేఖయే నీకుత్రైతాడయ్యె (తిరిగిజాబుజూచి) కపటోపాయంబునఁ బృథ్విసింగును గూల్చినందులకు మన్నాథునిక్షమింపరఁట. క్షమింపక చేసెడిదేమో. ఓయపాత్రురాలా! మీయాలయములందలి విగ్రహంబుల మసీదులకు సోపానములుగ నానాథుఁడొనర్చునపు డేమిచేయఁగల్గితివో నేఁడునదియె గావింపఁగలరు (తిరిగిజాబుఁజూచి) ధనాశాపాశసంబద్ధనగు నేను దక్క తామందఱుఁ బ్రాణములకైనఁ దెగింతురఁట. కాని యుత్తమరసపుత్రాంగనలు తురకను గట్టుకొనరఁట. వేగిరింపకే. నీయుత్తమత్వము, మానీచత్వము. అచిరమునఁ దేలఁగలదు. మూర్ఖురాలా! నాపాదరజంబునకైన సాటిరానినీవా? నన్నధిక్షేపించుట. నీవేమిచేయుదువు.

ఇందునీతప్పేమున్నది. నీపూర్వపుణ్యఫలపక్వము. విధిప్రాప్తి.నీగతి.

మత్యువుచేరువాటం బట్టియే నీయుందిట్టియుత్పాతనులు జనిం చుచున్నవి. కానీ. నానాథుఁడేతెంచుసమయ మైనది. ఉన్నదానికి నాలుగు మృషలు జోడించి పురిరెక్కించి నానాయకునకు ద్వేషముఁ గల్పింతుఁ గాక. ఈరాజులసత్యములేనిదే నమ్మరు. కొన్నికల్పింపక తీఱదు. (ఆలోచించును)

(ఔరంగజేబు ప్రవేశించును)

ఔర- ప్యారీ.

ఉద- (ఆలోచనాధీనమై ప్రత్యుత్తరంబీయకుండును)

ఔర- (డగ్గరి) ప్యారీ. ప్యారీ.

ఉద- నాథా దయచేసితిరా! మీసతి కడసారినమస్కారము నందు కొనుఁడు. (నమస్కరించును)

ఔర- ఏమిఅట్లాసెప్తావ్ నీకీషేమం లేదూ

ఉద- ఏమిసేమము. పెద్దయేటిలో సేమము.

ఔర- నీదీపేర్ నాదీపేర్ అంటాన్కి గడబిడషేయటాన్కి ఎవర్కి తాఖత్ ఉంది.

ఉద- అందఱకేకాఁబోలు నేయుతరమునఁ జూచినను నానిందయే.

ఔర- ఉత్తరాల్లోనీకి యెవ్వర్ దూసిచ్చార్ సెప్పూ

ఉద- నన్నొకర్తనే. దూషించిన నాకింతచింతయేలేదు.

ఔర- ఇంక ఎవరెవర్కి దూసించార్ -బోలో

ఉద- ఎవరినని చెప్పికొనియేడ్వను.మిమ్ములనే.

ఔర- కోఁ బహద్మాష్.

ఉద- రూపనగరాధీశునితనయ విమలాదేవి.

ఔర- ఆయిమలనాకీ యెందుకు దూసించింది.

ఉద- ఉత్తరము చిత్తగింపుఁడు. నేనుచదివెదను. ఆపెపొగరుఁబోతు తనము రాజద్రోహము తమకిప్పుడవిశదపడఁగలదు.

ఔర-సరేషదున్నో. (వినుటనటించును.)

ఉద- (ఉత్తరముఁజూచి) శ్రీమన్మహాలక్ష్మీసదృశలగు చంద్రావతిపిన్నమ్మగారి పాదపద్మముల సన్నిధికి తమకూఁతురు విమల వినయ విజ్ఞప్తి. జౌరా! కాలవిపర్యాసమున బెబ్బులినోటంబడిన సారంగమట్లు పృథ్వీసింగు పాదుషాహాచేతఁజిక్కి గతించె. ఇదిసైప రాదు. వీపదురుద్యోగము ప్రబలుటకుఁ గారణము వైభవమపేక్షించి యుదయపుర్యాదులు కొదుకక వీనిని వివాహమాడుట యే. క్షత్రియస్త్రీల నందఱ నౌరంగుఁడువీలైన గట్టికొననెంచెఁగాని యుదయపురితక్క యుత్తమాంగనలము చావనైనఁజత్తుము కాని యొప్పదుమే. పుత్త్రీశోకము మానఁగోరెద. జరిగినదానికై వగచిన లాభములేదు. ఇట్లు

రూపనగరము, విమల.

జౌర- (తనలో) అరే అల్లా ఏమిశెయ్యాలా.

ఉద- ఏమినాథా! ఆలోచించుచుంటిరి. ఇందులకుఁ బ్రతీకారముఁ జేయజాలరా? అటులయిన నన్నుఁ జావనిండు. (ఔరంగుని కత్తి లాగి కొనఁబోవును)

ఔర- (కత్తినీయక) ఏంశెస్తావ్. నువ్ ప్యాణం సంపుకోవాలా వద్దు. విమలాదేవ్కి జుట్టుకూ పట్కి వచ్చి నీకి నౌకర్ సేపిచ్చవాలా వుంది. లేక్ బోతే అలంగీదుబాదుషా ఉండాము లేదు. అల్లా సేపిచ్చలేక్పోతే నాకీమూరుపే రుండాది. పెమాణం శేస్తాక్ సూను. నాకి సేతకానోను అనుకోవాలా వద్దు. దెఖో

ఉద- నాథా నేనట్లు తలంపనేతలంపను. మీరు తలఁచిన దుస్తరమేది. (తనలో) ఇఁక నాకోపమాఱినట్లే. అలంగీరుపాదుషాహ తలపెట్టినకార్యమునకు భంగముండదు. విమలా! నీసిక్కుఁణఁగినది. నీవునిజముగాఁ జచ్చితివి. నాచేఁ జచ్చితివి. నిన్నిక్కడకుండచ్చిన పిమ్మట మాయంతఃపుర పరిచారకుఁడైన మసావదున కిచ్చి పెండ్లిసేయుచ్చుటఁ దీర్తు.

ఔర- ప్యారీ. నాకీ వుండాడు నీకి భయంలేదు. దిగుల్కుపడవాక్

ఉద- ఊఱడిం చెడివారుండఁగా నాకెట్టికొఱఁత యుఁ గల్గదు.

ఔర- అన్కున్న పని తొందర్గ శెయ్యాలా వుంది (బిగ్గరగా) కోఁ హైరే దర్వాజామే.

(వికృతాకారుఁడగుమసావద్ ప్రవేశించును]

మసా- ఆదాబ్. తక్సీర్- (సలాము చేయును)

ఔరం- మసావద్. సాదత్ ఖాఁన్కి బేగీ బులావు. బేగీపో(మసావదు నిష్క్రమించును)

ఔర- ప్యారీ. బేగీ యిప్లాంతంత్రికి విజయాసింగూకి ఉత్తరం రాయి. యిమలాని నాకీ యిస్తావ్ నైతో లడాయికివస్తావ్ అనిరాయి. నాకిదస్కత్ పెట్టుతాఁ బేగిరాయి.

ఉద- (ఉత్తరమువ్రాయుటనటించి)నాథా!ఇదిగో తాము సెలవిచ్చిన టుల జాబు లిఖించితిని. క్రింద తమ పేరు వ్రాసి విజయసింహునకు బంపుఁడు. (ఉత్తరమునొసంగి) నాయకా! మిమ్మొకవిషయ మడుగ మఱచితిని. విమల చంద్రావతికి వ్రాసిన జాబు తమకెట్లు లభించినది.

ఔర- ఆహు త్తగాన్కి మాయ షేసి తెప్పిచ్చా! దాన్కి కథ నీకియెందుక్! నేను జాబ్కు విజయసింహుడ్కి పంపీయేస్తాఁ సాదత్ ఖానూ వస్తూవుండాడ్ తుఁజావ్.

(ఉదయపురినిష్క్రమించును)

(సాదత్ ఖాను ప్రవేశించును)

సాదత్-తక్సీర్- జనాబ్.

ఔర- సాదత్ ఖాఁ.

సాదత్- జి సర్కార్.

ఔర- (ఉత్తరమొసంగి) యీవుత్తరంకీతీస్క-పొయ్యి విజయ సింహుడ్కి యిచ్చియెయ్యి. ముందు పైన్నిం రూపనగర్కి ముట్టడిపెట్టి వుత్తరంయియ్యాలజబాబు తీస్కరా! యిమల్కి

నాకియియ్యాలా అనిశెప్పు. యియ్యాకపోతే వాడ్కి-ష్టం పాడుశేసి యిమల్కీ-తీస్కా- బేగిరా. పో. జావ్.

సాదత్- (సలాముఁజేసి) నాకి షెలవు యియ్యి మహారాజ్ (నిష్క్రమించును)

ముసా- నయనపాలుఁడుసాబ్- ఆయేసర్కార్-

ఔరం- (తనలో) ఆయేహి. భోత్. ఖుషి. (ప్రకాశముగ) బేగిబులావ్. వాడుసమయాన్కి- వచ్చాడు, చంద్రావతి సంగతి కనుక్కో- వాలావుంది.

(ముసావద్ నిష్క్రమించును). (నయనపాలుఁడు ప్రవేశించును)

నయ- (తనలో) దైవవిధి నెవ్వరుల్లంఘింపఁగలరు. చంద్రావతి చిక్క లేదు. చంద్రావతియేమి? యిందిరతక్క- నాకెవ్వగుఁ జిక్క లేదు. ఆమెను బాదుషాకు నొసంగినఁ గొంత సంతోషించి చంద్రావతిని తీసికొనిరాఁజాలనైతినని కోపింపఁడు కాని యిం దిర నిచ్చుటకు నామన సొప్పకున్నది. ఆమె రూపరేఖావిలా సాది సద్గుణాబులు స్వప్నవ్యాప్తిలోనేని మఱపునకు రాకున్న యవి. నేను పట్టుపట్టి యెట్టులేని యారాపట్టిచెట్టఁ బట్టవలయు. నన్నువురంగుఁడు చంపనిమ్ము. ఇందిర దొంకినదని యనను, ఆహాహా

ఉ॥ ఇంపునఁ బూరికిఁ గొనక యెన్నియు వంకలుదిద్దుమోము నిం
దిందిరనీలమేని గణుతింపని మేల్క-చరాజిఁ గల్గి, య
య్యిందిరకంటె రూపమున నెక్కు-డుగా గణుతింపనైన, మా
యిందిరఁ బాసి నేఁబ్రతుకు టెక్క-డమాట, వియోగ మంగునన్॥

నాకాయువు చిక్కి-నదనిఁ జాలును. పాదుషా చిత్తగింపక మానఁడు. చిత్తగించిన మనదనుక రాదు నిజము తెలిసిన ముప్పుతప్పదు కల్లలాడు టపాయకరము(నిరసనభావమున) పాదుషాల కంత పరిశీలన యా? ఎనుఁబో తీనినదినఁగొట్టములోఁ గట్టుందురు నవాబులకుఁ

జెవులుతప్ప కనులు లేవు. శుద్ధమూఢులు(ప్రకాశముగ)సలాముసర్కార్
(సలాముఁజేయును.)

ఔరం-నయనపాలా, యాంబైఠో.

(నయనపాలుఁడుసంశయించును)

కుచి పర్వానహి ఆవ్ బైఠో! నీవు జోధపూరుకు పాదుషావుండావు.

(బలవంతముగఁగూర్చుండఁబెట్టును.

నయ- (తనలో)నా కింతగౌరవమున కింత యగౌరవ మున్నది.చంద్రావతి నాచేఁ జిక్కినదని నన్నిట్లుమెచ్చుకొనుచున్నాఁడు.అకటా! బోనునఁ జిక్కిన కొదమసింగము నైతినే దైవమా?నన్ను రక్షించినను శిక్షించినను నీదియేభారము.

ఔరం- (పట్టరానితమకమ్మున)శంద్రావతీవచ్చిందీ?నాపైన శంద్రావతికి ప్రేమావుండది లేదూ?నాకీయిష్టం సేపించ్చుకోవాలా! నామీద దాన్కి ఖుషీ వుండింది లేదూ!బోలో, శంద్రావతి సిన్నవాడ్కి యినంకీబట్టల్ బంద్ సేసి సంపించాముఅని యిన్నది లేదూదాన్ని లోపల్కి పంపినావు?నీకోసం మంచి మేడ కట్టిస్తాము అని పెప్పావు లేదూ.

నయ- (తనలో)చంద్రావతిపై నింతతమకమున్న పాదుషాహ యామె తప్పించుకొనిపోయిన దనిననమ్మునా?నమ్మి నన్ను బ్రతుకనిచ్చునా?కట్టా యెట్టియుక్తనైనను లోనైతినేమికర్తవ్యము.

[ఆలోచించుచుండును.]

ఔరం-నయనపాలా?పంపయం వద్దు.నీకీజోధపురం పంస్థానంయిప్పించవాలా వుండాది. అలంగీరుపాదుపా బాత్ తప్పుతాదిలేద్.

నయన- దేవా? దేవర యనుగ్రహమున్న నాకేమి కొదవ కాని ముఖ్యముగా నేనదృష్టవంతుఁడను కావలయునుగదా!

ఔరం- క్యాకే!నీకీ యేమితక్వా వుండాది లేద్. జోధ్ పూర్ జాగీర్ నీకి యిప్పిచ్చవాలా అస హుజూర్ అలంగీరుపాదుపా సిద్ధంగా వుండాడువోయి

నయన- [తనలో] యిందిరమాట చెప్పదునా! మానుదునా! చావు తటస్థించినది. ముందునుయ్యి. వెనుకగొయ్యి. ఏమైనంగానింకు. ఓటం దలందూర్చిరోంకటిపోటునకు వెఱవనేల? ఇందిర నాకు దక్కియేతీఱవలె (ప్రకాశముగ) తాము నాకు బహుమానము లొలోంటుంగావింతురనికాదు. ఈయప్రయోజకుండు చంద్రావతినిం దమకొసంగ (నెమ్మదిగా) లే-క-(వినంబడనియట్లు) పోవును.

ఔరం (కోపముతో) అరే ఘా. దూర్జావ్. నాలాయక్ సీదిమొహం షూడవాలె వద్దుబే [లేచికొట్టువానివలెంబై కివచ్చి] అరె బఃద్మాష్ చంద్రావతికి తీస్కరాకుండా వచ్చావు. నీకీషూస్తే పాపం వస్తుందీబె. నీవు ఆడదివుండావు నీకిషిగ్గు పరంలేదు.

నయ- అయ్యా! సెలవైన జరిగినసంగతి సాంగముగ మనవిం జేసెదను

ఔరం-ఎంతావుందీ-అంతాసెప్పూ.

నయన-పీఠముపై దయచేయుండు. మనవిచేసెద.

ఔరం-అరే. సువర్. గడబిడ్ సెయ్యకుండా బేగిసెప్పు— బేగీ

నయ- దేవా తమ యాజ్ఞానుసారముగ దుర్గాదాసునకుం దమయుత్తర మందించితిని. వానినిం జూచి యతం డతివినయము నటించి చంద్రావతి నేండే నీరాజెననియు యశవంతుని శ్రాద్ధాదులుం గూడ నిచ్చటనే జరుగవలెనని కోరుచున్నదనియు వచించెను. తమసెలవు ప్రకార మాయమ నిష్టానుసారముగం దీసికొనిరా నెంచి వల్లెయని యుంటెని. పదియవదినమునం గాంబోలు చంద్రావతిగుడారమున నామెకుమారుండు మృతుండయ్యెనని రోదం గావించిరి. ఇంక నాపై జోధపురసంస్థానమునకుం గత్తి గట్టువా రుండరు కదా యని లోలోన సంతోషించుచుంబిల్ల వాని శవంబును బయటకుం బంపిన నుత్తరక్రియల జరిపింతునని వార్తబంపంగా దుర్గాదాసుండు వచ్చి చంద్రావతి తనబిడ్డనుదన చేతిమీందగ భూస్థాపనముం జేయుననిచెప్పంగా నమ్మితించితిని.

ఔరం- అరే. బేగిబోలో. తప్పువుందీనీకీ. నీకిషిక్ష పెయ్యవాలావుంది.

నయ- దేవా తరువాతఁ జంద్రావతినిఁ బ్రయాణము కమ్మని కబురంప శరీరము స్వస్థతగా లేదనియు రెండుమూఁడుదివసములు లాఁగి బయలుదేరుదమనియు జవాబీయ, దుర్గాదాసునిముఖలక్షణ ములకు నేననుమానపడి చంద్రావతిగుడారముఁ బ్రవేశించి చూడఁగా నందు చంద్రావతి పొడకట్టదయ్యె. దుర్గాదాసుని చెలియలిందిరమాత్రము చంద్రావతిదుస్తులదు ధరించి కూర్చుండి యుండె. చంద్రావతిని నే నెఱిఁగినవాఁడనగుటచే నందియపడి "యీయమయెవ్వతె" యని యచట నున్నదాసిని భయపెట్టి యడుగ నిందిరయనియుఁ జంద్రావతివృత్తాంతముఁ దా నెఱుఁగననియుఁ జెప్పె. పిమ్మట చంద్రావతింగూర్చి యిందిరాదుర్గా దాసులఁ బ్రశ్నింప మిన్నక హేళనఁ గావించిరి కాని వేఱుజవా బీయరైరి.

ఔర- పోనియ్యి- ఇందిరికి. దుర్గాదాస్కీ- పట్కె వచ్చావు లేదు-

నయ- అయ్యో? ఆయదృష్టముగూడ నాకు లేకపోయెను. ఇందిరా దుర్గాదాసుల నచటఁగలరసపుత్ర సైనికులతోఁగూడబంధించికొ నివచ్చుచుండ మధ్య రావసింహుని సైన్యంబులు వారికిఁదోడ్పై మనసైన్యమును జంచి చెండాడె. ఆసందడిలో నిందిరాదుర్గా దాసులు తప్పించుకొని పోయిరి. చేయవలయునని చేసిననేరము కాదు. ప్రమాదము. పైని యేలినవారి చిత్తము. నాప్రాప్తి.

ఔరం-నీకీ ముందు కాబూలునుంచి సవారి పంపావు లేదూ.

నయ- (తనలో)అయ్యో!యిందిరను నేను పంపినసంగతి వీనికెట్లు తెలి సె. కాదుకాదుఔరంగుఁ డెప్పుడు నదలింపులలో గట్టివాఁడు (ప్రకాశముగా)దేవా నే నెవరినిఁబంపితిని?

ఔరం-ఎవర్కీ పంపివుండినాదీ లేదూ?

నయ- (తనలో)ఇదియెధైర్య మవలంబింపవలసిన సమయము(ప్రకాశ ముగ)నేను నిజముగా నెవ్వరినిఁ బంపియుండలేను.

ఔరం-(తనలో)నామన్సి నకి కాబూల్కి సవారి పోయింది సెప్తాడు వీడు నాకీ దగా సేస్తాను ఉండాడు.నిజం తెల్పిచ్చాలా(ప్రకాశముగ)మసావద్ మసావద్.

(మసావదు ప్రవేశించును)

ఓయ్‌మసావద్ నయనపాలు యింట్కిపోయి మీూమిగోను నయనపాల్డు శెప్పాడురమ్మన్నాడ్ మీూకి అనిచెప్పి అందఱిని కొత్తవాళ్లకిపిల్చుకరా.

(మసావదునిష్క్రమించును.)

నయ- (తనలో)నిక్కముగా నేను చచ్చితిని.

సీ॥ భ్రాతృకుమారుఁ జంపఁగఁ బాదుషా కేను
జేయూఁత నొసఁగిన చెట్టతనము
అన్న భార్యను దెచ్చి యవురంగునకుఁ దార్పఁ
దలఁచియత్నించిన తులువతనము
కసవు మెసఁగి నైనఁ గడకుజోధపురంబుఁ
బాలింప నెంచిన పలువతనము
ఇందిరాదేవియా సుందర నెల్లని
కూడ నూహించిన కొంటెతనము

తే॥గీ॥ తుదకు నిర్భీతిఁ బాదుషాయెదట నిలచి
బొంకులాడిన యాపొగరోతుతనము
కలసి నన్నేమికావింపఁ గలవు నేఁడు
నయనపాలుఁడు చిపర కనాథుఁడయ్యొ॥

అదిగో మసావదు ఇందిరను దోడ్కొని వచ్చుచునేయున్నాడు

[మసావద్ ఇందిరప్రవేశింతురు]

ఇంది- [కోపముతో]ఛీ! దేశద్రోహియు భ్రాతృద్రోహియు వంశద్రోహియు సర్వద్రోహియునగు నయనపాలుఁడిచటనే యున్నాఁడు వీనిముఖసందర్శనము పాపహేతువు. భారతమాత గర్భమున నింతపాపియిఁకఁబుట్ట బోఁడు.

మ॥ అనుజద్రోహము కూడదంచుఁ,బరకాంతాసక్తి చేటంచు,సజ్జనవి
ద్వేష మపాయమంచును, స్వదేశప్రేమ ముఖ్యంబటం
చును, జంద్రావతి కెగ్గుసేయఁదగదంచుర్,పీనియాస్యంబుమీఁ
దనునిష్ఠీవన మాచరింపఁదగు, హైందవప్రజానీకముల్॥

ఔరం- అరే నయనపాలా!యీ ఆడదియెవరా?

నయ- (తనలో)ఇప్పుడైన నిజమాడినఁ బ్రాణము దక్కునేమో? (ప్రకా
శము)ఈపెయిందిర తప్పుచేసితి గడ్డికఱచితి చెంపలువాయిం
చుకొందును. ఇఁక నెన్నఁటికి నిట్లుకావింపను. విధేయుఁడను.
క్షమింపుము. మ్రొక్కుచున్నాఁడ. దిక్కులేనివాఁడ (అని
పాదములపైఁబడును)

ఔరం- (కోపముతో) అరే'థూ. దూర్జావ్. ఝూట్ బాత్ బోల్తా
శే సువర్.

[అనితన్నుచున్నాఁడు]

నయ- [వంగి వంగి సలాముఁ జేయుచు]అయ్యా- రక్షింపుఁడు. మోహ
ముచే రాజద్రోహముఁ గావించితిని.

ఔరం- అరే మసావద్ నయనపాలుడ్కి తీసుకపోయి ఖైదికి పెట్టు
సచ్చినరోజుదాక ఖైదు మెయ్యాలా! జావ్

[మసావద్ నయనపాలుని గెంటుకొని పోవును]

నయ -[తనలో] నాకిపు డుభయభ్రష్టత్వము చేకూఱె. రెంటికిం జెడిన
రేవడి నైతిని. చంద్రావతి చిక్కలేదు. జోధపురసింహాసనం
బెక్కలేదు. ఇందిర దక్కలేదు. నిజమునకు స్వయంకృతాప
రాధమే యిది. కాన

సీ॥ మాతృదేశద్రోహ పాతకుండగు క్రూర
కర్ముఁడుపాకితోఁ గాల్పవలయుఁ
బరమసాధ్వీమానభంగ చేతస్కుఁడో
బెట్టిదు నిల్వున వ్రేల్చవలయు

వైభవంబాసించి వంశవిభ్రష్టుఁడౌ
నట్టివానికి వాతఁ బెట్టవలయు
దాయలంజేరి సోదరునకుఁ గీడు కా
వించుదుష్టుని పూడ్చి వేయవలయు
తే.గీ॥ మాతయనఁగఁజాలు భ్రాతృగృహీతను
తురకజేనిఁ గూర్పఁ దొడరుబముఁగు
కండకండఁ జీల్చి కాకులాదిగఁగల
పతగతతుల కెఱగ వైవవలయు॥

ఛీ. ఛీ. నాబ్రతుకు నొక్క బ్రతుకగునా? పాదుషాహ నాకుఁ శిక్ష వేసిన నీయపఖ్యాతి వినకుండఁ జచ్చెడివాఁడను.

మ॥ సమదర్శిత్వము, పాపభీతియు, స్వవంశప్రేమ, దేశాభిమా
నము, చేశంబున శూన్యమైననరు జన్మంబేల? తత్తుచ్ఛదే
హమపేక్షింపవు నక్కలుందుదకు, సత్యంబిద్ది, దుష్కీర్తి లో
కమువర్ధిల్లెడిదాఁకఁ బోదు, పరసౌఖ్యంబేది దూరంబగుర్॥

నన్ను క్షమించి నాబుద్ధిలోపమును మన్నించువా రెవ్వరును లేరు. ఇఁక నెవ్వనితో నాయుదంతముఁ జెప్పికొందును. అయిన నిట్లు క్షమార్పణముఁ గోరెద.

శా॥ స్త్రీలోలత్వముచేతనేఁ జెడితి, భ్రాతృద్రోహ సంప్రాప్త దు
శ్శీలత్వంబున నింకనుం జెడితి, నిన్నీ యంతఃశోకబాక వె
గ్గాలోచించితి నీకు మూర్ఖతను, జోహః దేశమాతామత
ల్లీ లోకైకగుణప్రభాకలితవల్లీ నన్ను సైరింపుమా॥

పరమ దుర్గుణ సమేతుఁడనగు నన్నవ్యాజకరుణతో మోయు చున్న భారతమాత నన్నే కాక నాయపకీర్తిఁగూడ మోయుచున్నది. కన్నతల్లి సహింపక యేమిచేయఁ గలదు. నన్ను క్షమింపవలసినది ముఖ్యముగా నిందిరయే!

ఉ॥ భారతమాత దుస్థితినిఁ బాపి, శుభోన్నతిఁగూర్చుచుర్, సము
ద్ధారణ మాచరించు నవతారసతీమణి వైననిన్ను నే

గోరితి, సక్షమింపు, మిదిగో! శరణార్థిని యిందిరాలలా
మా! రజపూతవంశ కలశాంబుధి నూతనచంద్రబింబమా! ॥

(నయనపాలుఁ డిందిర పాదములపైఁ బడఁబోవును)

ఔర- అకేమసావద్. వీడ్కి బేగి తీస్కపో. వీడిది మొఘం సూడరాద్

(మసావదు నయనపాలుని విడిచిపెట్టి ప్రవేశించును.)

మసా- (ఇందిరతో) అరే నీకేబుద్ది గిద్ది వుండాది లేద్. పాదుషాకి సలాంకరో అమ్మా!

ఇంది- (మసావదును కోపముతోఁ జూచి) ఏమనిరా! ప్రేలితివి.

సీ॥ చంద్రావతీ మహాసాధ్వీమతల్లీ ప
దాంబుజసేవ ధన్యతరమైన
జోధపురాధిపునూను నజితసింహు
నలరార నెత్తి ధన్యతరమైన
బిగియారుకౌఁగిట వీరోద్ధతుఁడగు మ
న్నాథుఁడు దన్ప ధన్యతరమైన
అలరాజకులదైవ మైనట్టి యాదిమ
హాశక్తిపూజ ధన్యతరమైన
తే॥ గీ॥ పాణియుగ్మముమోడ్చి మత్ప్రాణమేగుఁ
గాక దుర్మార్గునకుఁ బాపకర్మునకుఁ
గుటిలమతికిని గోభక్షకునకుఁ బాదు
షాకు జోహారుసల్పను సల్పనోరి॥

ఔర- (తనలో) ఇది బడా ఝూటాపుండింది. దొర అంటు పిర్కాలే కుండా అంటుంది కనుకోవాల. (ప్రకాశముగ) నీకి యెవ్వారి కీపేరు క్యాఅమ్మా.

ఇంది- వినుము. పౌరుషమునకెల్లఁ బట్టుకొమ్మయగు జోధపురము నావాసస్థలము. అసమాన బాహుబల శౌర్యవిద్యాసద్గుణో పేతుండగు యశవంతసింహుని సర్వసేనాపతియగు దుర్గాదాసుని చెలియులను. అగణిత మహమ్మదీయ దుర్మార్గ కానన

నిర్మూలనాసక్త కఠోర కుఠారప్రతిమాన నిర్వక్రానన్య సామాన్య పరాక్రమక్రముఁడగు రూపసింగునకర్ధాంగిని. నామ మిందిరాదేవి. రోమరోమమునకు నిత్యసత్యవిక్రమగాంభీర్యదయాది సద్గుణంబు లుప్పొంగు దశదిగ్విశదయశోవిరాజితమగు రసపుత్రవంశము నావంశము. తెలిసెనా నాయుదంతము.?

ఔర- (తనలో) షంద్రావత్కి సంగతి దీన్కి తెల్సింది వుంది. దీన్కి మోషంసేసి షంద్రావతియెడ్డావుంది శెప్పిచ్చవాలా! పైన తమాసా శెయ్యవాలావుంది. (ప్రకాశముగ) ఇందిరాదేవి. నీకి వొడిలో యేంపడిందిబే. షంద్రావతికి నీవు పంపేశావు లేదు? సచ్చిబోలో!

ఇంది- (తనలో) ఈదుర్మార్గుఁడు తనదురభిప్రాయమును బయటవేయుచున్నాఁడు. అబలనని జంకి వీనికిఁ బ్రత్యుత్తరమీయకుండరాదు. (ప్రకాశముగ) చంద్రావతిని నేనే యమ్మాటికి దాఁటించితిని. ఏమియోడిలోఁబడునని దాఁటించితి వంటివా? ఒడిలోఁబడునని దాఁటించెడిది మీకులము కాని మాకులము కాదు. మఱి యెందులకు దాఁటించితినో వినుము.

సీ॥ చనుబాలు మఱచిన దినమాది చంద్రావ
తీప్రసాదంబును దినుటవలన
అవసానదశయందు యశవంతుఁ డామెను
హస్తంబులం దుంచి సందుచేత
స్వకులాభిమానమ్ము పలుమారునాకతి
ప్రోత్సాహ మొనరించు చుంటఁ జేసి
అపాదమస్తమ్ము కోపమ్ము మాకు మ
హమ్మదీయులపైని నలరుకతన
తే. గీ॥ రాజకులమునఁ బొడము కారణవశమున
యవనదార్జన్య మభివృద్ధియయ్యెఁ గాన

గొప్ప పేరును గందమఃగోర్కి కలుగ
నెలమి చంద్రావతిని పంపవలసె సుమ్ము॥

ఔరం- అరేమర్యాదా గిర్యాదా లేకుండా మాట్లాడ్తావు. అలంగీరు పేరు నీకీష్టూపిస్తాణ భయంలేకుండా వుండావు.

ఇంది- నేనేల భయపడ వలయును.

సీ॥ ఒనరింప వలసిన పనులు సర్వంబు ని
ర్విఘ్నంబుగా నెఱవేఱెఁగానఁ
దురకలకుంబలె తుచ్ఛంపుఁబ్రాణముల్
క్షత్రియులకుఁదీపికావు కానఁ
గండకండనుజీల్చి కనుఁగొన్న నిందిరా
వనితకుఁ దప్పు కన్పడకు కానఁ
బటుశౌర్యమునకెల్ల పట్టుకొమ్మైనట్టి
రజపూతవంశంపు రమణిఁ గాన
తే॥గీ॥ ఇందిరాదేవి నిర్భీతి నెదుట నిలచి
పాదుషాహామాటకు మాఱు పలుకఁగలిగె
పాదుషాహాయననేల దైవంబ కాని
తప్పులేనట్టివారలు తలఁకఁగలరె॥

ఔరం- (అదరిపోయి) ఈఆడది బడాగట్టిది వుండది. మొగోడు అంటె భయంకి గియంకి లేకుండ ఘాటల్ యేస్తూన్నుంది. ఇదిగయ్యాళికి మొండికి వుంది. హుజూరు భయంలేకుండా బాగా మాటాడుతువుంది. అచ్ఛా (ప్రకాశముగ) ఇందిరా! యెంతసాహసం తెల్వీ వుండింది. నీకి నయనపాలునికి నీవు యెందుకు సిక్కినావుబోలో

ఇంది-

సీ॥ శక్తిసత్కృప యున్నఁ జాలదే యెటనున్న
బెదరేమియునెడి నిర్భీతిచేత
దాక్షిణ్యశూన్యుఁడై తనరారునీయవు
రంగుఁడర్క నీదుదుర్మతముచేత

వంశంబుఁ జెఱుప నుద్భవమందిన నయన
పాలుని మేటిపాపంబు చేత
చంద్రావతింగావ నమకట్టి తద్రీతి
నాచరింపఁ గలిఁగినందు చేత
తే॥ గీ॥ దొరకినా నంతమాత్రానఁ దురకదొరలు
సంబరంపడఁ బనియేమి, సాహెబయ్య!
తనకుఁ దాఁ జిక్కినట్టి తలిరుఁబోఁడి
కొకరి ప్రజ్ఞావిశేషంబు లుండనేల॥

ఔర- (స్వగతము) దీనిసాహసం వింటానికి ఆచ్చ్యావుంది. దీనికి మొగోడు ధైర్యం వుంది మంచిఆడది (ప్రకాశముగ లేనికోపముతో) ఇందిరా నీకిబేమర్యాదా మాటవచ్చివుంది. నీకి సిచ్చయేయిస్తె యెవరు తోడువస్తారు ఉండారు.

ఇంది- నాకుఁదోఁడే లేదా?

సీ॥ దీనమందారమై త్రిజగదాధారమై
తనరు మాశక్తిమతల్లి తోఁడు
కలనైన సమ్మవారలకు ద్రోహంబుఁ జే
యని నాదు సత్ప్రవర్తనమె తోఁడు
చాపున కాసించి చంద్రావతిని భద్ర
పఱచిన న్నారాజభక్తి తోఁడు
బలవంతముగఁ బట్టి పసిపాపనొకనిఁ జం
పించిన నీపాపవృత్తి తోఁడు
తే॥ గీ॥ భాస్కరుఁడు తోఁడు సర్వదిక్పతులు తోఁడు
చందురుఁడు తోఁడు భువి యాకసమ్ము తోఁడు
తారకలు తోఁడు మన్మనోధవుఁడు తోఁడు
రాకాలము తోఁడు నాపరాక్రమము తోఁడు॥

ఔర- (తనతో) దీనిమాట యింటె నాకీ ధైర్యంగా మాటా వస్తుంది లేదు (ప్రకాశముగ) - ఇందిరా నీదిసమత్కారంవసనం

నీదీషాహసాన్కి నీదీషౌర్యానికి నీదీగాంభీర్యాన్కి నీదిమంచి గుణముల్కి మెచ్చాం కాని చంద్రావతిక్కి నీకీ యెట్టాతప్పించ డాన్కి యీలుచేసినావు. బోలో.

ఇంది- (తనలో) ఇతఁడు మాటలమధ్య చంద్రావతిప్రసంగము తెచ్చు చున్నాఁడు, వీనిని మఱపించెదఁ గాక (ప్రకాశముగ) ఔరంగ జేబు? నన్ను మెచ్చుటకు మెచ్చుకుండుటకు నీవెవ్వఁడవు.

సీ॥ కన్న కొడుకుల గారవించినయట్టి
చంద్రావతి నను మెచ్చంగ వలయుఁ
దల్లియుఁ దండ్రియు దైవమైనట్టిరూప్
సింగునాథ ర్త మెచ్చంగ వలయుఁ
ధళిధళీయుని తలపుంకించి యుత్తమ
క్షత్రియులెల్ల మెచ్చంగ వలయుఁ
బేరుఁ బ్రతిష్టలఁ గూరిచి మయునోము
శక్తిమతల్లి మెచ్చంగ వలయు
తే॥ గీ॥ సంతసమున దేశము మెచ్చంగ వలయు
సాహెబా! తల్లితండ్రి మెచ్చంగ వలయు
సంబరమున సైందోఁడు మెచ్చంగ వలయు
స్వర్గవాసి మారాజు మెచ్చంగ వలయు॥

ఔర- (తనలో) దీనికో మాటల్కి ఆడ్డం తప్పూవుంది. ఊర్కావుంటే అచ్చావుంది (ప్రకాశముగ) ఓయిందిరా! నాదీ మెప్పునీకీ ఖుషి లేకుండాపోయింది అని నీకిఅంటె, షమిచ్చార్, షంద్రా వతి యెక్డావుంది బోలో! శెప్పితే నీకి షిక్షలేకుండా యిడ్చి పెట్టెస్తా దెఖో.

ఇంది- (స్వగతము) ఇతఁడు నన్ను విడచుఁగాక. విడువకపోవుఁగాక, చంద్రావతి విషయము చెప్పిన మాకెట్టినుప్పు కలుఁగఁజాల దు (ప్రకాశముగ) సాహెబూ! మఱియొకటి కాదు. వేయిప్ర శ్నలడిగినను జవాబీయఁగలను. చంద్రావతిని రక్షించిన విధ

మును వచించుటకు నిరాకరింతునా? నిరాకరింపను. తత్కథ వచించుటవలన మత్ప్రజ్ఞా విశేషముఁగూడ మీరెఱుంగఁ గలరు. వినుము. నిత్యము మాగుడారమునకుఁ బెరుగుఁ బాలుఁ దెచ్చియిచ్చు గొల్లదానికి లంచమిచ్చి యజితసింహుని దాని బుట్టయం దుంచికొని వెళ్లుమనియు మేముచెప్పిన సంకేతస్థలమున నుంచుమనియుఁ జెప్పితిమి. అట్లాగొల్లది యొనర్చిన పిమ్మట నేనుగుడారమునఁ బ్రవేశించి నాదుస్తులఁజంద్రావతికి వేసి ముసుఁగువైచి వెలుపలకుఁ బంపితిని. అంతకుమున్నె చంద్రావతిరాకకై నిరీక్షించు శివసింగామెను గమ్యస్థానమునఁ జేర్చెను. గుడారమునఁ జంద్రావతి రూపముతో నున్న నన్ని నయనపాలుఁడు బంధించి కొనితెచ్చెను, చంద్రావతి తప్పించుకొని పోయిన యుదంతమిది.

జౌర- ఇందిరా! మీచంద్రావతి యిప్డు యాడవుండింది. నీకి తెలిసివుండిందిలేదూ! దాన్ని నీకియక్కడా వుంచావు. బోలో.

ఇంది- ఆవిషయము నీవడుగఁదగినదికాదు. నేఁజెప్పఁ దగినదికాదు. చెప్పఁదగిన విషయమంతయు నాకై నేనె చెప్పితిని.

జౌర- (కోపముతో) చంద్రావతి సంగతి నువ్వ శెప్పావాలనాకి. శెప్పకపోతే నీకి ఉదయపురికాడ దాసీబనికిపంపుతాఁ.

ఇంది- ఓతురుష్కా! రాజపుత్త్రకాంతల గుండెలు దుర్మార్గుల బెదరింపుమాటల వలనవడఁకునవి కావు. మానహాని లేనియేకార్యమునకు నియోగించినను నీచేతఁ జిక్కిన పాపమునఁ జేయక తప్పదు.

జౌర- నీకి మంచి బుద్ధివుంటె నీకినేను ఉదయపురికి కట్టినట్లు నిఖాకట్టేవాణ్ని. బడాఝూటా వుండావుబే నువ్.

ఇంది- ఓరీ! నీచమ్లేచ్ఛా యొడలెఱింగి మాటలాడుము. నీపాపము నీకీయిహలోకమందుననే కట్టికుడుపక పోదు.

సీ॥ సిగ్గు లగ్గును వీడి ఛీయన నుర్విని
స్వైరియించుట కుదయపురిని గాదు
సిరొాక్క మూసించి నీమాట పాటింప
లోభిరజా నయనపాలుఁడను గాను
కనుపించు వారినెల్లను నంటకట్టుకో
బుద్ధిలేని తురక ముదితఁ గాను
మిఠిమిాటి యీరీతి మిగిలితివేని సిగ్
బ్రాణితోఁ బోనిచ్చు దానఁగాను
తే॥ గీ॥ నన్ను నెవ్వతెగా నెంచి నావొ! వినుము
పాదుషా దురుద్యోగప్రభంజనోద్య
మాహిత భయంకరోగ్ర శౌర్యాభిరామ
యిందిరాదేవి యంచెద నెఱుఁగుమోరి॥

ఔర- ఇందిరా నీకీబడాచోటా తెల్వద్. నీకి షిక్షవేయించాలా గాని నాకి దయకల్గిందీ. లేకపోతె యేమిషేసినా శెసేవాణ్ణీ. ఓరే మసావద్ ఇందిర్కీ తీస్కపొయ్యి ఉదయపురికి దాషీపని శేయించాలా! బేగీతీస్క పో! బేగి.

(మసావదు ప్రవేశించి యిందిరను లాగికొని పోఁబోవుసు)

ఇంది- ఓరీ! ఔరంగా! నీదుర్మార్గము సాగినంతకాలము సాగఁబోదు. సాధ్వీ శాపాతురము లూరకపోవు.

మ॥ అవమర్యాదల నాచరించెదవె? రాజ్యాంధుఁడవై సత్సభా
భవనంబందు పతివ్రతామణికిఁ దత్పాపంబుచే మ్లేచ్ఛరా
జ్యవినాశంబగుఁ గాఁలి క్షత్రియులచే సంగ్రామకేళిఁ బరా
భవమార్జింతువు గాఁత! దేశమున సౌభాగ్యంబు వాటిల్లుతన్॥

(మసావదు. ఇందిరనిష్క్రమింతురు)

ఔర- (స్వగతము) షరే. షంద్రావతీ షంగతి తెలిసింది. దానికోసం బడేపని శెయ్యావాలా వుంది. యిమల్కీ నాకే తెప్పిచ్చాలా. విజయసింహుండికీ నేనుపుత్తరం రాయించాను. యిమల్కీ

సఖా కట్టూకొంటార్. నాకీ అదృష్టం పట్టింది. విజయసింహుడు మావుత్తరం శూసిగాఫరా అయ్యి నాకీ యిమల్కీ యిచ్చి యేస్తాడు. లేకపోతే వాడ్కి దుంపాతెంచి యిమలాకి నాసైన్నెం తెచ్చి తీర్తుంది. రూపనగర్ సంగతి చెప్పడానికీ బంట్రోతువచ్చాడేమో కనుక్కోవాలవుంది. బేగిపోవాల. అక్కడ యేమైందో!

[ఔరంగజేబు నిష్క్రమించును]

రంగము _ అంతఃపురము.

(మసావదు ఇందిరాదేవి ఉదయపురి ప్రవేశింతురు)

మసా- (ఉదయపురితో) అమ్మా నీకీ యీమెపేత నౌకరి చేయిచ్చుకోమన్నారు. సర్కారు, ఆలంగీరు పాదుషా (అనియిందిరం జూపును)

ఉద- (మసావదుతో) సరే నీవేగవచ్చును

(మసావదు నిష్క్రమించును)

(తనలో) పాదుషాకుఁ జిక్కిన దీమెయేకాఁబోలు. వహా వ్వా? సేమి యీచక్కఁదనము. దీనినిఁ జూడఁగనె పాదుషావా మనసుకరఁగి యుండవలె (ప్రకాశముగ) ఓసి నీనెవ్వతెవే?

ఇంది- నేనా ? నేను కలనైన తురకలకంపు గిట్టనిదానను.

ఉద- నాప్రశ్నకు నీకులమెయ్యది యని యర్థము.

ఇంది- నాముఖవైఖరిం బట్టి కనుఁగొనుము.

ఉద- (కోపముతో) ఏమే తారతమ్యము తెలియకుండ మాటలాడెదవు. నే నెవతెనో నీ వెవతెవో నీకునా కెంత యంతరములకదో తెలిసి మాటాడుము. నీపేరేమి?

ఇంది- (తనలో) ఔరా? దీనియహంకారమునకు సముద్రమునకు నంతులేదు నోటికివచ్చినటులనఱచిననఱచుఁగాక. దీనికిసరియైనప్రత్యుత్తరమొసంగి రాదు (ప్రకాశముగ) నానామముతో నీకేమిపని?

ఉద- దాసిపేరు తెలియక దాస్యముఁగావించుకొనుటెట్లు?

ఇంది- నీయిష్టము వచ్చినటులఁ బిలుచుకొమ్ము.
ఉద- అదినాప్రశ్నకు జవాబు కాదు.
ఇంది- కాకపోయినఁ బోవచ్చును. కాదని నేనెఱుఁగకపోలేదు.
ఉద- ఏమంత యమర్యాదగఁ బ్రత్యుత్తరములా?
ఇంది- మర్యాదగఁ బ్రశ్నించువారికి మర్యాదగనె జవాబిత్తును.
ఉద- మహారాజ్ఞి దాసిని మర్యాద చేయవలయునా?
ఇంది- ఎవరు మహారాజ్ఞి? యెవరు దాసి?
ఉద- నేనురాణిని. నీవుదాసివి.
ఇంది- నాకునేనే రాజ్ఞిని. నీకునీవే రాజ్ఞివి.
ఉద- మిఱి మీఱకుము. దుర్గతి పాలుకాకుము.
ఇంది- ఆమాటలు నేనేల? యనరాదు.
ఉద- అనరాదు.
ఇంది- అనియెద. ఏల యనరాదు?
ఉద- నేనురాణినౌట.
ఇంది- నేనేల కారాదు?
ఉద- నీవెట్లగుదువు?
ఇంది- నే నెట్లుకాను ?
ఉద- నీకుమృత్యు వాసన్నమైనది.
ఇంది- పాదుషాలే నాపాదధూళి శిరములఁదాల్చు నుండఁగా నాకెక్కడి మృత్యువు.
ఉద- (తనలో) అనుకొనిన యంతయైనది. ఈపెను పాదుషా వలచినటులీపె వచస్థితియే చెప్పుచున్నది. (ప్రకాశముగ) నీవుపాదుషాహ గారికెట్లుచిక్కితివి.
ఇంది- నాచేదాస్యముఁ జేయించుకొనుటకే నీకడ కనుపఁబడితిఁ గాని యీ ప్రశ్నలకు జవాబిచ్చుటకుఁ గాదు.
ఉద- ఎంతచక్కని దాసివి నీచే నేనుకాదునాచే నీవే దాస్యము చేయించుకొనులాగు కనుపడుచున్నది.

ఇంది- ఓడలుబండ్లు బండ్లోడలు కావచ్చును. అంతసుకృతము లభింప వలయునుగదా నీదాస్య మభిలషించుటకు.

ఉద- (కోపమున) ఏమే నోటికివచ్చినటులఁ బ్రేలుచున్న దానవు. మదాంధత్వమునఁ గన్నులు కానవచ్చుటలేదా ?

ఇంది- కానకయే కులభ్రష్టవై తురకను గట్టుకొంటివి.

ఉద- మమ్ము ధిక్షేపించుచుంటివా ?

ఇంది- ఏమని?

ఉద- తురకను గట్టికొంటిమని.

ఇంది- నీ వ్యవహారము గుమ్మడికాయ దొంగరీతిగఁ బరిణమించినదే.

ఉద- ఛీ. నివిచ్చోటును బాసిపొమ్ము, నీసందర్శనము పాపహేతువు.

ఇంది- నీవుపొమ్మనినఁ బోవుదునా? నిమ్మనిన నెత్తునా?

ఉద- నాకడ కేల వచ్చితివి.

ఇంది- పాదుషా వెళ్లుమనుటఁబట్టి.

ఉద- ఎందుకొఱకు.

ఇంది నీకు దాస్య మొనర్చుటకఁట.

ఉద- నాతోఁబోరాటమే కాఁబోలు నీవునాకొనర్చు దాస్యము.

ఇంది- కాదు నీవుచెప్పుచొప్పున దాస్య మొనర్తును.

ఉద- అయినదాస్యము కావింపుము.

ఇంది- నీవు చేయించుకొనుము.

ఉద- చేసినఁగదా చేయించుకొనుట.

ఇంది- చెప్పినఁగదా చేయుట.

ఉద- నీకు రాజగృహములకడ మెలఁగవలసిన మర్యాదలు తెలియవు. పూర్వపరిచారికలంగలసి చేయవలసిన విధులెఱుంగుము.

ఇంది- అట్లె(నిష్క్రమించుచు తనలో) నాయందుపాదుషా కనురక్తి కలదని యుదయపురికివ్యక్తపఱచితిని. నేను తప్పించుకొనుట కిదియె మంచియుపాయము. ఇంకఁ గొన్ని దినముల కొఱంగుఁడు నన్నుఁ బెండ్లియాడనుండెనసకూడఁ దెల్పెద. పిదప సమయాను

కూలముగఁదప్పించుకొనెద. పైని దైవమే కలఁడు.

(నిష్క్రమించును)

ఉద- (దుఃఖముతో) ఇందిరాదేవిని సౌందర్యమున మించు నీసతిని నాయకుఁడిదివఱకె మోహించి యుండును. లేకున్న నింతస్వతంత్రముగ మాటలాడునా? స్త్రీలోలుఁడును, మాయామయుఁడునగు నౌరంగజేబు తనగుట్టు బైటపడకుండుటకు దీనిని దాసియని వెల్లడి చేయుచున్నాఁడు. ఈయుపాయమునుండి బైటపడుట కుపాయ మాలోచించుకొనవలయును (యోజించి) దీని నింతటితోఁ గడతేర్చుటకంటె గత్యంతరము లేదు. ఇక్కార్యమున కెవని నియోగించిన బాగుండును. ఎవ్వరో యేల! మన మసావద్ మొదలగువాండ్రే దీనికిఁదగినవారు. వాండ్రీ నీచకృతి కొడంబడుదురా? పడకేమి యొకరూకకుఁ బదిరూకలొసంగిన నెంతపనియైన చేయుదురు. నేనీ సవతిపోరునకు జంకెదనా? చేతి మీఁదగ దీనిఁ జంపించి యమబాధలకు జంకెదనా? పరమున బాధ లెవరు చూచిరి. ముందిహమునఁ జక్కఁగ వెళ్లఁబుచ్చినఁ జాలును. దీనిని బ్రతుకనిచ్చితినా! నాపని శూన్యమే. ఔరంగజేబిఁక దీనివలలోఁబడి నా మొగమైన చూడఁడు. ప్రస్తుతము దీనిఁ జంపించుటకంటె మఱియొక సుఖోపాయము లేదు. నాకు దాసియే కావలసియున్నఁ గొలఁదికాలములో విమల రాఁబోవుచునే యున్నది. మాసేన పోయి రూపనగరమును ముట్టడించియే యుండును. అంతఃపురపరిచారికలయభిప్రాయముఁగూడఁదీసికొని యిచ్చవొప్పున నొనరింతునుగాక.

(నిష్క్రమించును.)

ద్వితీయాంకము.

సమాప్తి.



శ్రీమత్సరదేవతాయైనమః.

# పాదుషా పరాభవము.

## తృతీయాంకము.

---

రంగము. రూపనగరము. సౌధము.

[విజయసింహుఁడు ప్రవేశించును]

విజ- ఏమికారణమొకాని యౌరంగజేబు తనసైన్యమంపి నాపురి ముట్టడింపించె. నిష్కారణముగ నీతనికీదుర్బుద్ధి యేలకలుగవలయును. ఔను దుర్మార్గులకు దుర్బుద్ధి యొకప్పుడుకలుగవలయునా! దానికొకకారణము కావలయునా? ఇతరులజోలికిరాని మాబోటుల హింసింపనేఁటికి? సజ్జనాపకారమే దుర్జన స్వభావము. అగుఁగాక.

చం॥ చెదరఁడు గుండె నీవిజయసింహుఁడు సంగరమన్న వైరి దుర్మదహరుఁడైన వీని నపురంగుఁడు తాఁకి జయింప నెంచెనియ్యదనున, వానికిఁ విజయ మబ్బునొకో? రజపూత శౌర్యసంపద, మొగలాయి యోధ నిజ బాహుబలస్థితి నేఁడు తేలుతన్ ॥1

(సేవకుఁడు ప్రవేశించి)- దేవా? మొగలాయి సేవకుఁడొకఁడేతెంచి తమదర్శనార్థమై ద్వారమున వేచియున్నాఁడు. ఏమియాజ్ఞ

విజ- ప్రవేశపెట్టుము.

( సేవకుఁడు నిష్క్రమించును. మొగలాయి సేవకుఁడు ప్రవేశించును )

మొగ- ఆదాబ్ మహారాజ్. ఢిల్లీ మీకి మెర సర్దార్ సాదత్ ఖానిచ్చి రమ్మన్నదీ జీ(అనియుత్తరమిచ్చుచున్నాఁడు)

విజ- (ఉత్తరమందుకొనివిప్పి)ఆలంగీరుపాదుషాహి విజయసింహునకు వ్రాయించునది యేమనఁగా! నీతనయ యగు వినుల నభిలషించితిమి.తనయనిత్తువా?అనికినత్తువా?(అని లేఖ క్రిందవైచి కాలితో రాచిపై నుమిసి)సేవకా?

తే॥గీ॥ కమ్మలోపలి సంగతిఁ గంటి నను

తోడనే పాదమునఁ ద్రొక్కినాఁడ నను

మీదఁ లేఖపై ముమ్మాఱు మిసితి నను

యరుఁగు మిదెయె తనకు జవాబంటి నను॥

ఓరీఅవురంగా?రాజపుత్రుల మర్యాద నెఱుంగవటరా?

ఉ॥ ఏమని యెంచితోరి?మదహీన బలోద్ధతి నిగ్గు,గుజించి, నిర్ధామము కావె?పల్కిన విరుద్ధము,శ్రేయమె రాచవారితో నైమఱవుం బ్రసంగము,కుమార్తెల మాలలకేవి తార్వఁగా మేమును సాహసింపుటకు మ్లేచ్ఛనృపాలుర యంతవారమే॥

మొగ- (తనలో)అరేబాత్ కోపదారిమడిసీ వుండాడ్(ప్రకాశముగ) మాకీ అట్టాగె సెపుతార్. సెలవు సర్కార్(అనిపోఁబోవును)

విజ- ఇదిగో! చెప్పక పోయెదవుసుమా. నేనాడిన నుడువులు నా చేసినచేఁతల రీతులు ముక్కకుముక్క ఫక్కికిఫక్కి జరిగినదిజరిగినట్టుల మీసర్దార్ తో చెప్పుము. ముందుపొమ్ము.

మొగ- మాదీయేంపోయింది మహారాజ్. అట్లాగె శెపుతామ్.

(నిష్క్రమించును,)

విజ- (కోపముతో) మాయోపాయ పారంగా? ఔరంగా! తనయ నీకున్న ననికే తెంతువా?మ్లేచ్ఛకురంగ మృగేంద్రుండనగు నన్నే మనిభావించితివో ?

తే॥ గీ॥ నను గెలుచుట కెవ్వండనో విను జగత్ర

యైక భావితాకుంఠితాస్త్రైక ఘోరార

శాత్రవారణ్య శౌర్యాగ్ని హోత్రుఁడంచు
విజయసింహ భూపాలు భావింపు మోరి॥

* దురాత్ముఁడు లేఖ నెంతనీచముగా వ్రాయించినాఁడు. వానికిఁ బోఁగాలము దాపురించె. కాననే యిట్టివిపరీతపు బుద్ధిపుట్టినది.

శా॥ ఔరంగుఁడన నెంతవాఁడరె! మదీయానూన కోదండమౌ
ర్వీరావంబునకుఁ భయంపడక పోరిఁ నిల్వఁగా లేఁడు ను
ర్వారోగ్రారి కురంగబృంద బలహార్యక్షుంబు నఁ దాఁకిపోఁ
గారా దుద్భటవైరి సంహరణ విఖ్యాతాత్ముఁడౌ శౌరికిఁ ॥

ఇఁక నేనరిఁగి కోటదాఁటి విరోధిగణంబు రాముఁడఁ జేయవలయు(పోఁబోయి)ఏమిది. విమలయుఁబద్మయునిటువచ్చుచున్నారు. ఏమిహేతువై యుండును. ఆలస్యమైన నగుఁగాక. వారిరాక యేలనో కనుంగొని వెళ్లెద.

(విమలయుఁ బద్మయుఁ బ్రవేశింతురు.)

విజ- మీరిట్లేల వచ్చితిరమ్మా!

విమ- నాయనగారూ! మీరుపెద్దగా నుపన్యసించుటవిని యేమియో కనుఁగొను తలంపునవచ్చితిమి.

విజ- అమ్మా! ఏమియులేదు. ప్రాజ్యసామ్రాజ్య మదాంధకార దుర్విదగ్ధాతిక్రాంత మర్యాదుండగు నౌరంగుఁడు నాకీయుత్తరమంప నలిగిపెద్దగాఁ బ్రశంసించితి ఇదిగో? ఉత్తరముఁ జూడుము. (క్రిందనున్న జాబుచూపును)

విమ- (పద్మతోఁగలసిచదివి) ఆఁ. అలంగీరుపాదుషా యంతటి పరాక్రమక్రముండా? రాజపుత్రులు గాజులుఁదాల్చి రనుకొనెను కాఁబోలు. "వినాశకాలే విపరీతబుద్ధిః" అనులోకోక్తి ననుసరించిన వీనికవసానదశ ప్రాప్తించినది. నాయనగారూ? దీనికి జవాబంపితిరా?

విజ- ఊరకుందునా? ("కమ్మలోపలి" అనుపద్యముఁ జదివి) అదివచ్చిన సేవకునితోడనే జవాబుఁ బంపితిని.

విమ- కుక్కకాటునకుఁ జెప్పుదెబ్బ యైనది. తగిన ప్రత్యుత్తరంబ.

విజ- తల్లీ యిప్పటి కేమైనది. వాని వేలుతో వానికన్నే పొడచి నట్లుల వానికుర్క్రాగ్రాసిధారాహతిచేత నే వాఁజక్కాడవలయు. నాఁడుగదా కృతార్థులము. అప్పుడె శత్రుసైన్యము కోట కెగఁ బ్రాఁకుచున్నది. బల్మినైన నిన్నుఁగొనిపోవఁ గలఁడఁట. చూచెదఁగాక. నేనుతడయక సమరసన్నాహవిధులయందప్రమత్త చిత్తంబున మసలవలయు. అమ్మా? మీరుత్వరలో నంతఃపుర మునకుఁ జేరుఁడు. పగవారికంటఁ బడకుఁడు. నేనిచట నాలసిం ప వీలు లేదు. పోయివచ్చెద. (నిష్క్రమించును)

పద్మ- విమలా ? వీనికిదేమి చేటుకాలమొ. వీని దురితము లంతంతకు దురంతములగుచున్న వేమికారణమో?

విమల- పద్మా ! అనేక హేతువులు కలవు వినుము.

సీ॥ వీరులౌ క్షత్రియుల్ పేదలై కొందఱా
తురకసేవ నొనర్పఁ దొడరుటొకటి
మనవారలందఱు ధనమునకాసించి
కూఁతులవానికిఁ గూర్చుటొకటి
నిర్హేతుకంబుగా సిలువునఁబృథ్వీసిం
హునిఁ గూల్పమన మూరకొనుట యొకటి
ఔరంగజేబ్ జిజియాపన్ను మనముచె
ల్లించుట కంగీకరించు టొకటి
తే॥ గీ॥ చేరి మనవింతచుల్కనఁ జేయఁజేసి
వీని పాపవృత్తుల నభివృద్ధి పఱచె
మొత్తఁ, జిత్తమా, మెత్తఁగాను త్తవాని
లోకసామాన్య మియ్యది లోలనయన॥

తెలిచినయిల్లుఁ జొచ్చుగ్రామసింహంబు భంగి నౌరంగుం డభ్యంతర మేమియు లేమి రాజపుత్రస్థానము పైకి మాటిమాటికిఁ బరు గిడుచున్నాఁడు.

పద్మ- (ముందునకుఁజూచి) ఈయుప్రస్తుత ప్రశంసలకేమిగాని తురుష్క సేనఁజూచిన కనులు మిఱుమిట్లుగొల్పుచున్నవనుట లో నతిశయోక్తిలేదు. మనసైన్యమా బహుస్వల్పము. తురుష్క సైన్యమా? యనల్పము. ఎట్లు మనవారు వాండ్రెదుర్కొనఁగలరో తెలియఁదరము గాదు, కావలసియున్న నింకను ఢిల్లీనుండి రాఁగలదు.

విమ- ఐన మనమేమిచేయఁ గలము. ఎట్లుజరుగ వలసినవి యట్లైజరిగి తీరును. వెఱచినలాభము లేదు. కావలసిన క్షేమలు మేలులు లలాట లిఖితంబునుఁబట్టియుండును- మఱియు.

ఆ॥ వె॥ తురకసేన సోఁచె ధరణి యీనినయట్లు
స్వల్పమయ్యెను మనవారిసేన
అసి జయాపజయము లరయ దైవాధీన
మనుదు శేమిమనకు మునుఁగఁగలదొ॥

ఐనను మ్లేచ్ఛులా? రాజపుత్త్రులనా? గెలుచుట. ఆఁ. మూఁగివాఁడమ్మా యనుదినము రావలదా? పద్మా! బవరముఁ జేయుటకు వెఱవకుము.

తే॥ గీ॥ కాందిశీకులైన ననేకమంది యేల?
చాలఁడే యసదృశశౌర్యశాలి యొక్క
డెందునకుఁ గొఱగాని వేకృతు లవేల?
ఘనయశంబిడఁజాలు సత్కావ్య మొకటి॥

వదినా? ఐనప్పటికి మొగలాయిలు ఖడ్గయుద్ధ మాచరింపరు. మనరణమునకు వారిరణమునకుఁ జాలవ్యత్యాసముకలదు. వాండ్రకు విరోధిసంహారమునకు వలసినన్ని శతఘ్నులు నాళయంత్రములు కలవు. ఏది యెట్లు పరిణమించినను నబలలము మనవలన నగుపని యేదియు లేదు. ఆపన్నివారణార్థమై కులదేవతయగు శక్తిని బ్రార్థింతము. (అని పద్మసహితముగ నిలువఁబడి దోసలియొగ్గి (ఆకసములక్ష్యముంచి)

## ౘ కవిరాజవిరాజితము ౘ

జలమునఁ ద్రోచినఁ జాలను ముంచిన క్షత్రియసంతతి భారము నీ
తలఁ గలదే మియొనర్తువొ మమ్ము నధైర్యముఁ జెందితిమమ్మ తురు
ష్కులతి దురాత్ములు దాసుల సత్కృపఁ జూడుము మానము ప్రాణములున్
నిలుపుము నెట్టన యయ్యపురంగుని నేఁడపరాజితుఁ జేయఁగదే॥

విమ- పద్మా! శక్తిశాలుఁది విరోధులంతోఁ బ్రతిఘటింపవలయుఁ గాని కేవలభక్త్యావేశముతో శక్తినిఁ బ్రార్థించిన కృతార్థలమగుదుమా? విరోధులు పైకొనినపుడు భక్తియోగమున మైమఱచి యనేకులు రాజన్యులు సాటిదేశములకంటె నొకచేయి మిన్నగనున్న మనమాతృభూమిని హీనదశకుం దెచ్చిరి. తెచ్చుచున్నారు. తేఁగలరు. ఇది ప్రపంచవిషయము. ఈవిషయమై చర్చింప మొదలిడిన దూరము పోవలసి వచ్చును. ఇపుడు మనకుఁ దోఁడుపడు రాజులెవరేని కలరా యని విచారించుట లెస్స. నీవును కర్తవ్యమాలోచింపుము.

పద్మ- (తనలో) ఆమ్మో! విమల కడుపునిండ నెన్నియూహలున్నవి! ఔను. ఏపుట్టలో నేపామున్నదో తెలియదు. ఇన్నిదినములనుండి నాకు బహిఃప్రాణముగ నున్న యీయమ యూహలు నా కగ్రాహ్యములైనవి. అగు. నిండుకుండ తొణకునా! కంచా మ్రోఁగుటకు. ఈమె రాజకీయపరతంత్రత మిక్కిలి చిత్రమైనది. సమయము వచ్చినది కాన నీయమతోఁ గొంచెము సరసప్రసంగముఁ గావించెద (ప్రకాశముగ) ఊహించితి. కర్తవ్యమూహించితి.

విమ- ఊహించినది వచింపవచ్చును.

పద్మ- కోపింతువేమో?

విమ- బాగు. బాగు. నా బాగు వచించినఁ గోపమేటికి. ఈప్రపంచమున నట్టివారుఁగూడఁ గలరా?

పద్మ- నీ బాగునకే వచించుచుంటి. అది నీకోగుగఁ బరిణమింపవచ్చు.

విమ- ఈవిమర్శనము ఖండనము ఏల చెప్పెదను? ఆచరణీయమొ కాదో విచారించెదను.

పద్మ- అటులయిన వినుము. ఔరంగజెబుని నీవు వరించిన యెడ నీసమరమే లేదు. దీనసితండ్రికి మేలుఁ గూర్చినదాన వగుదువు నీవుమహారాజ్ఞి పదవి నందుదువు.

విమ- ఛీ. ఛీ. క్షత్రియులనోట రాఁదగని పలుక్కలేల బలుకుదువు. అవసరంబైన.

మ॥ కరవాలంబు ధరించి శక్తికలదన్కన్ బోరి తిర్వాతిఁ గం
ధరముల్ నాకయి నేనె త్రుంచుకొని మత్ప్రాణంబులర్పించి ఘో
రరణక్షోణికిఁ బేరునిల్పుకొన వీరస్వర్గ రాజ్యాది సు
స్థిరసౌఖ్యావహ భోగభాగ్య జలరాశిన్ బేర్మి నోలాడెదన్॥

పద్మ- నీవే నీవు రణభూమి కవతరించిన యున్నచుండఁగా నుయ్యాలపై మేడూరుపడినదన్నట్లు లపజయంబటులుండఁ దురకలచే నవమాన మొకటి పైఁబడును. నీ యుసిచేతలు డబ్బుఁబెట్టి యాబ్ధికముకొన్న రీతి.

విమ- వధూసికా! సిండముసిగ్గిసఁ జలియు నీలికుమించిన లోతు లేదు సుమా.

పద్మ- సిరి రా మోఁకాలొడ్డునట్లు మహారాజ్ఞీపదవి కాలఁద్రోచి దుర్మరణముఁగాంతుననిన నోరు చేసెడిదేమి? ఒకరు చెప్పెడిదేమి.

విమ- చెప్ప నక్కఱ లేదు. చేయ నక్కఱ లేదు. ఎప్పటి కేదిప్రాప్తమో యదిప్రాప్తింపక పోదు.

పద్మ- నీవు నా చెప్పినచొప్పున వర్తింపవేని ముప్పుతప్పదు. నీవే విజయసింహవంశ స్ఫురదుత్పాత ధూమకేతు వగుదువు.

విమ- నీవుపూర్వపు పద్మవేనా? కావా? లేక నీ కేమయిన యున్మాదము కలిగినదా? అదియు నిదియుఁగాక త్రాఁగుబోతులఁగూడి కల్లుఁ జవిగొంటివా? కాకున్న నీ కేటిచేటు.

పద్మ- జౌనమ్మా. ఉన్మాదులందఱు దమయెదటివారి నంద ఱనుబిచ్చి

వాండ్రిగను భ్రాతృగుఁబోతులుగను భావించుట స్వాభావికము. నీమేలుఁగోరుదానఁ గాన నొక్కి వక్కాణించుచుంటి. ఇప్పటికైన నామాట పాటిచేయుము.

విమ- ఇఁక మాటాడకుము. హానికరము గ్రహించుటకాదు వాని యుత్తమాంగముపై మత్పాదమేని యుంప నియ్యకొనను. నీవింక నిట్టి మరర్థసూచక వాక్యముల భాషించితివేని సైరింపను.

పద్మ- (తనలో) పులికకుపుఁజలిచీమ జనించునా? (ప్రకాశముగ) నుఱుఁదలా కోపింపకుము. నీమనోవృత్తి మఱయఁగోరి చేసిన నా ప్రసంగమును సైరింతువు గాక. ఇఁక మనసహాయార్థమైనట్టు తల క్రిందనుండికొని త్రాళ్లు వెదకినట్లు యుక్తపురుషుఁ డెవ్వఁడాయని యోజింప నవసరము లేదు.

విమ- నేను కోపపడినందులకు క్షమింపుము. కాని మనమాటపాటించి మనకుదోడుఁ బహుబలవంతుఁ డెవడమ్మా.

పద్మ- నీగీచినగీటు దాఁటనివాఁడే. నీచేరువ పారిజాతమే. నీయఱచేతి నిమ్మపండే.

విమ- ఎందులకే వేధింపులు. నాతో సరసములు.

పద్మ- మఱి విరసులతో నా! సరసములు.

విమ- అబ్బా నాకు విసుకు జనింపుచున్నది. ఆపురుషు నామోచ్చారణముఁ గావింపవుగదా?

పద్మ- అతఁడునీ కెంతలో మఱపునకువచ్చెనే. ఎవఁడో? ఎఱుఁగవా! పేరుఁజెప్పుదునా? ఆగ్రహింపవుకద.

విమ- ఇదియేమి విచిత్రము. మనకుఁదోడగు పురుషునిఁజెప్పిన నాగ్రహ గ్రహ మొందులకు.

పద్మ- వగలాడీ. నీవాతని నెఱుఁగవా?

విమ- అయ్యో- నేనాతని నెఱిఁగియుండవచ్చును. ఎఱిగినను నీమనసు గ్రహించుట యెట్లుశక్యము. ఆమహాను భావుని నామాక్షరము లుచ్చరించిన నరిగిపోవుదునేమో యనుకొంటివా?

పద్మ- నీవు బిరుదులొసంగిన వానిపేరే యెఱుంగవా?

విమ- (నవ్వుచు) ఏమో నీవాగ్గుంఫనము నాకభేద్యముగ నున్నది.

పద్మ- మాయలాడీ! అతిథిచేఁబామునుజంపించుబుద్ధిమానవైతివికదా!

విమ- ఇది యేమి కర్మము నిష్కారణముగ నన్ను దూషింతువు. ఎందుకు మనకీపోరాటము. ఏటికీ ముసుఁగులో గ్రుద్దులాట.

పద్మ- బోటీ! నాఁటి వనవాటికలోని ముద్దులాట జ్ఞప్తికిఁ దెచ్చుకొనిన గ్రుద్దులాటయే లేదు.

విమ- అనఁగా నుదయపురాధినాథుఁడనియా నీతాత్పర్యము.

పద్మ- నాతాత్పర్యమేమి? అతఁడే. అతనితోఁగాక నీవింక నెవనితో ముద్దులాడితివి. ఎంతటిజాణవే. ఆమెనా, పోయెనా, అప్పుడే పేరుఁ జెప్పక యుదయపురాధిపుఁడంటివి. అవు నుదయపురాధిపుఁడే. తురుష్కకుల నిర్మూలనోద్యమ రాజసింహుఁడే. భవదీయ నిర్మలహృదయ కాసారవిహార రాజహంసయే.

విమ- కొండనుద్రవ్వి యెలుకను బట్టితివి. ఐనఁ గర్తవ్యమేమి?

పద్మ- కర్తవ్యమేమికలదు. రాజసింహుని శరణుకోరుటయే.

విమ- ఎట్లు!

పద్మ- లేఖాపూర్వకముగ.

విమ- (ఆలోచించును)

పద్మ- ఏలయమ్మా! ఆలోచన.

విమ- మనబోటిబోటుల కీపోటుములు పాడియా?

పద్మ- వనమున జరిగిన వృత్తాంతము కంటె నిదికూడనిదియా?

విమ- సరియే. ఏమైనఁ గానిమ్ము. లేఖలిఖింతుఁ బోదగువానిఁ జేర్కొనుము.

పద్మ- (ఆలోచించి) బాహుశక్తియందును యుక్తియందును నసమానుఁడగు నీగురువుగారైన సామల్పండితులఁ బంపించెదను.

విమ- నేనుత్తరము వ్రాయుచుండెదను నీవేగి సర్వము నచ్చుఁజెప్పి గురువుగారిఁ దోడ్తెమ్ము.

పద్మ- పోయి వచ్చెదను. (నిష్క్రమించుచున్నది)

విమ- (జాబు వ్రాయునట్లుల నటించి) ఉత్తరమేమని వ్రాసెద. ఏమని వ్రాసిన నామాట మన్నించునో యట్లువ్రాయవలయును. వారి నేమని సంబోధింతును. ఎట్లు వారిని సంబోధింపవలయునో యట్లె (వ్రాయఁబోయి) అయ్యో! సిగ్గువిడతునా? విడువక తీఱునా? ఇక్కార్యంబు నాకపఖ్యాతికరము కాదుగదా! (ఆలోచించి) ఎట్లగును? ఎందఱెందఱు మహాస్త్రీలు నేనుసంచరింపఁబోవురీతి సంచరింపలేదు! వేటికింత.

సీ॥ వరియింపునన్నని హరినిఁబిల్పించిన
రుక్మిణి నెవఁడు విరుద్ధమనియె
ప్రద్యుమ్ననకు వార్తఁబంపినయట్టి ప్ర
భావతీసతి కేమిప్రతిభ తగ్గె
అనిరుద్ధుఁ దెప్పించుకొనినట్టి యుషకు నే
పాటిదుష్కీర్తి సంప్రాప్తమయ్యె
చిల్కచేఁ బిల్పించి శ్రీశుగ్రహింప ల
క్షణకు నేమాత్రపు ఘనత తఱగె.
తే॥ గీ॥ నింక శ్రీరాజసింహుని కేను నేఁడు
వ్రాయుచోలేఖ నంత యేవచ్చుచేటు
సందియంబేల సందేశ మందఁజేసి
నీచయవనాధములను ఖండించుదాన॥

(అని వ్రాయునటుల నటించి. పెదవివిఱచి చించి తిరుగవ్రాసి) బాగున్నదికాదు. (మరలవ్రాసి) ఏమో! ఇట్లువ్రాసిన యేమను కొనునో!(చించితిరుగవ్రాసి) ఎంతగోలనైనను యింత పేలవము కూడదు.

(పద్మ సామల్పండితుఁడుప్రవేశింతురు)

సామ- ల్పండితుఁడు- ఏమమ్మా! అంటివి. ఇఱందఁజేయఁజాలనా? మీయుత్తరమునా? రాజసింహునకా? చేర్పవలయునా?మూఁడు దినములకు, ఎందులకంత, రెండుగడియలకు, కావలయు

నన్ను రెండునిముసములకు. తొందరమైన యూకుణము నకు. నావ్యవహారము నెఱుంగవా? సామల్పండితుడు కాడా వీడు. చెప్పునదంతయుఁ జేయక మూరువాఁడా! వీడు.

పద్మ- చిత్తము. తను రట్టివారే. దయచేయుడు.

సామ- చిత్తము గిత్తము నేనెఱుఁగను. ఇత్తటి నుత్తరమీలాగునఁ బొఱవేయుడు. నెత్తిని గుడ్డవేసికొని పోయివచ్చెదను. "ఆలస్యా దమృతంవిషం"

పద్మ- ఉత్తరము విమలయొసంగఁగలను. రండు.

(సామల్పండితుఁడు. పద్మ విమలయొద్దకు వత్తురు:)

విమ- (లేచి) గురూత్తమా! నమస్కారములు:

సామ- సురూప యౌవన సాహస స్వకుల దేశాభిమాన సకలవిద్యా సద్గుణ పతిప్రాప్తి రస్తు.

పద్మ- (నవ్వుచు) చాలకుటచలో నాశీర్వదించిరి.

సామ- ఏమే నాతోడనా! హేళన.

విమ- అయ్యా! మూవదినసంగతి మీరెఱుఁగరు. దానినోగు మాటామ చుండఁగనే నొస లెక్కిరించుచుండును. ఆ పెంకో నేమికాని తమతో నాకిప్పుడు కావలసినకార్య మెఱిఁగియే యుందురుకదా.

సామ- నాతో మీకుఁ గావలసినకార్యము తలఁచి జేయుచున్నాను. సంశయింపకుము. పనియిదివఱకేవినియున్నాను "శుభస్యశీఘ్రం" బనినటులనన్ను వేగమెపంపివేయుము. ఆలసింపకుము.

విమ- అయ్యా! నన్ను రక్షించినను శిక్షించినను మీకటాక్షము.

సామ- ఏమిభయములేదు కన్నుమూసి తెఱచునంతలో నుత్తరము రాజసింహునకొసంగఁగలను.

విమ- ఏమో! నమ్మలేకున్నాను ఎటుచూచినను దారక సైన్యమే. కోటుల కొలఁదిగ నున్న యాతురక పోటుకాండ్రఁదప్పించుకొని కోటఁ దాఁటి బైటఁబడి సాటిబోటులు నోటుపోటు మాటలతో చీటికిమాటికి నవ్వకుండ నెట్లుమాటదక్కింతురో యూహింపఁ

జాలకున్న దాన.

పాదు- వెఱ్ఱిదానా! భయపడకుము. ఈ త్రాగుఁబోతు తురకలను గను
కప్పాటకు ఫకీరునో బైరాగినో రాముఁడనో భీముఁడనో రాజునో
తిరాజునో వెఱ్ఱినో మొఱ్ఱినో యై సమయమువచ్చిన నాఁడు
వాఁడనో మూగదాసనో యైయందివచ్చిన జుట్టు అందరాకున్న కాళ్లు
బట్టుకొని డేఁగచందంబున రాజసింహుని చెంగిలను. శరీరము
దాఁచుకొనక రక్తముప్రవహించునటులఁ గష్టపడికార్యము సి
ద్ధ్యర్థింతు. బహుమాన మెమియుట్టజెప్పుము వృా చూచెదనుగదా.
తురకలు క్రామవీంద్రతలలలోని జీజెమ్మవచ్చినను భయములేదు.
బలే బలే. ఇంక నేమి చెప్ప. తేపులేదు. ఎల్లుండ లేదు. ఆపైరోజు
లేదు. నాల్గవరోజు దయము. ఊఁ. రాజసింహుఁడు త్తివారంటి
మాసపి కిదాయిన నాకు, గారెలు, బూరెలు, అమవడలు, అ
ప్పాలు, అరిశెలు, బొబ్బట్లు, దోన్నెఫలాహారాలు, పూరీలు
పూతప్పాలు, పెసరట్లు, కుడుములు, అమృతఫలాలు, కజ్జి
కాయలు, ముక్లెంగమునువులు, పోకుండలు, చక్కిలాలు, మినప
యిడ్డెనలు, పొంగరాలు, సున్నుపుండలు, నువుమూరుండలు, లడ్డు,
లనూ్క, అపి, యిపి నానపధములమిఠాయీలు, ఫలావళులు,
త్రాగినంత మఱిగ్రాఁచిన పెరుగు, పాలు, తీనవాకపు మజ్జిగ,
కోరినకూరలు, ఖళ చెంలాద గోఘృతము, పెట్టించును. నిత్యము
ముష్టిగా భోజనముఁ గావించుకొని హంసతూలికాతల్పంబుపై
ఁపగ రత్నస్నగ్ధసౌధాంతర్భాగంబుల రాజాధిరాజువలె భోగజల
రాశినోలాడుచుండెదను. ఏమమ్మా వెలవెల పోయిచూచెదవు.
ఉత్తరం మిమ్ము. మూఁడవపూటకు మరలివచ్చెదను. వెళ్ళునపుడు
రెండుకాళ్ళుగుఱ్ఱము, మరలివచ్చునపుడు రాజసింహునిడిగి సింహ
పుఁబిల్లవంటి యశ్వము నిప్పించుకొనియెక్కి తిరుగులున్న పులుగు
వలె నిమ్మౌలవ్రాలుదును.

విమ- గురూత్తమా! ఉత్తరముదిగో. ప్రత్యుత్తరమునకై ఉత్తముతి

త్తరపడుచుండును. (అనిడుత్తరమిచ్చును)

సామ- (తీసికొని) ఓయుత్తరమా! రాజసింహ హృదయ వశీకరణౌషధమా! మహమ్మదీయ కుల ప్రాణాపహారమా! విమలానిర్మల ప్రేమాస్పదమా! ఉదయపురాధిప మనోహరమా! రసపుత్రి లోకానందకరమా! మత్పూర్వపుణ్య ఫలమా? సత్ క్షత్రియ వీరలలనా రత్న చేతోమోదావహమా! నిన్నుఁబంపించునది యీవీరయువతి, పరిగ్రహింపఁబోవునది రాజసింహభూపతి, అట్లైన నిన్ను భద్రపఱుపఁ గలస్థానము నాకడఁగలదా చెప్పుము. నిన్నుత్తమాంగమునధరింపఁగాఁదగు(తలగుడ్డచెంగునను త్తరము ముడివైచి) విమలా? నేనిఁకఁ బోయివత్తు (పోఁబోవ)

విమ- అయ్యా? ఒక్కమాట (అనివెంబడించును)

సామ- విమలా! ఇదిగో నాసంగతి నీవెఱుఁగవు. తలపెట్టిన కార్యము నెఱవేరునందాఁక నిప్పులుత్రొక్కిన మర్కటమట్లు లొకచోట నాకుఁ గాలానదు. మనసులో మనసుండదు. కనుక నన్నేగ నిమ్ము. నన్బిలువ వలదు. నాపే రెత్తవలదు. నాజోలికి రావలదు. నాతోఁబలుకవలదు. పలుకుఁబలికిన నలుక కలుఁగును. చెప్పుమాట చెప్పుము. వెళ్లివచ్చెదను.

విమ- దేవా? వ్రాయవలసిన సంగతులు సాంగముగ నుత్తరముననే వ్రాసితిని. ఈపలుకులుఁగూడ సెలవీయఁ బ్రార్థింతు.

సీ॥ రక్షించినను లేక శిక్షించినను నాదు
జీవిత మాయనచేతి దనుము.
చిక్కఁగారానట్టి చెన్నఁటి మొగలాయి
సేనలమధ్యను జిక్కితనుము
సాహాయ్య మొనరింప నూహించుచోఁ దన
పాటివారలకిది స్వల్పమనుము
స్వకులాభిమానాది శౌర్యాతిరేకంబు
లెఱ్ఱఁగింపనియ్యదే తరుణమనుము

తే॥ గీ॥ హస్తములమోడ్చి కరుణించు మంటిననుమి
యొనర విపదబ్ధి నద్దాఁకుచుంటి ననును
తోఁడురాఁడేని కీడుచే కూడుననును
పట్టి రిపునట్ట నర్జ జెట్టఁబట్టుమనుమ॥

సామ- అమ్మాయికురాలా? ఇవియన్నియు నాతోఁ జెప్పవలయునా? నే నెఱుఁగనా? చూచిరమ్మనినఁగాల్చి రానా? ఇదిగో (చిటికవే యుచు) ఇన్ని మాటలేల వినుము.

సీ॥ శత్రుల వంచించి సత్వరగతి రాజ
సింహుసాన్నిధ్యంబుఁ జేరువాఁడఁ
జేరి యచ్చటిమన స్థితిగతుల్ పూసగ్రు
చ్చినరీతి నతనితోఁ జెప్పువాఁడఁ
జెప్పుమాత్రమె కాక చిటికెలో మొగలాయి
మ్రుచ్చులఁ దునుమ్య దోడ్తెచ్చువాఁడఁ
దోడ్తెచ్చి జయలక్ష్మితోఁ బాటు నిన్నును
గూడనాతనికిఁ జేయకూర్చువాఁడ
తే॥గీ॥ ఇందు నెందు నేసియుఁ దప్పి తేనివినుము
నేను నిజముగ సామల్పండితుఁడఁ గాను
భారతీయుఁడఁగాను వేపలుకులు లేల
తల్లిదండ్రులగతులకుఁ దప్పినట్లె॥

ఇఁకఁ బోయివచ్చెదను. దైవము రమ్మనినను వెనుకకుఁ దిరుగను. విమలా! వెఱవకుము. కార్యము నెఱవేర్చుకొని రాజసింహుని తోడనే రాఁగలను. (పరుగెత్తుచున్నాఁడు)

విమ- (పెదవివిఱచి)

చం॥ త్వరపడనేరుజాతిలిఁ గదా, రిపుఁగూల్చి గ్రహింపుము మము సా
కరమిది కాదు కాదు తగుకార్యము కన్నెకు గేలిసేయుము
నరు పరివారుహాస్యవచనంబుల నేదెటులైనఁగాని యు
త్తరమునుగౌరవించినయతండదె చాలును మేలుకీనునర్ ॥

(పరికాశముగ) చేయవలసినపని చేసితిమి. ఫలితార్థమేమగునో చూడవలయును.

పద్మ- ఫలితార్థమిాకే మున్నది. మనోవేగంబున నిన్నురక్షింప రాజసింహుఁడు వచ్చియేతీఱును.

విమ- ఏమో నాసందేశ మాదరించునో లేక యనాదరించునో సందేహాస్పదము.

పద్మ- ఇందుసందేహమునకు సందేలేదు. ప్రథమసమాగమమున నే వనమున నంగుళీయక మొసంగి మన్నించి నిన్నటులఁ గన్నరసికుఁడు శరణాగతత్రాణ బిరుదాంకితుఁడు నేఁడు వ్యతిరిక్తముఁ గావింపఁడు. నిన్నుఁ బరాభవింపఁడు.

విమ- రాజులు తరాజులు. క్షణచిత్తులు. చిత్తంబులు తేనెఁబూసిన కత్తులు. నూతనప్రియులు. సామ్రాజ్యసామ్రాజ్య మదాంధకార దోధూయమాన మానసులు. వారిమాటలు నీటిలోమూటలు. వారిసహవాసము త్రాఁచుతోసయ్యాటము. వారిచేతలు మహాపాతక ద్యోతకములు. వారితపములుబకజపములు వారినిష్టలు దుష్టచేష్టలు. వారితీరెఱుఁగవూ? :

పద్మ- రాజులట్టివారైనను రాజసింహుఁడా తెగలోనివాఁడుకాఁడు.

విమ- అందునకే కొంతయాస.

పద్మ- కొంతయాసయనుట విశ్వసనీయముకాదు. నీకాస పూర్తిగాఁ గలదు. సద్గుణుఁడనియే లేఖవ్రాసితివి.

విమల- పద్మా! అట్టులేయనుకొనుము. నాకాయనయందు గాఢవిశ్వాస మున్నమాటనిజంబ. ఏమగునోచూతము. ప్రకృతావస్థతొలఁగుటకు సుఖమబ్బుటకు దైవానుగ్రహమె ప్రాధాన్యము. కాన నిప్పుడు దైవప్రార్థనముఁ గావింపనగును. మనప్రయత్నమైనది. దైవయత్నమున్నది. (కేలుమోడ్చి) రామా! దీనమందారమా.

సీ॥ భీషణ రావణాభీల పటుప్రతా
పానలజ్వాలఁ జల్లార్చెనెవఁడు

లోకైకసంభావి తాకుంఠితాస్తోక
భార్గవశౌర్య విభంగుఁడెవఁడు
గాథేయసవన విఘ్నాయత్తచిత్త సు
రారికదంబ సంహారియెవఁడు
నక్తంచరోత్తమ రక్తపానాసక్త
చటులదుర్వారోగ్రచక్రియెవ్వఁ
తే॥ గీ॥ డట్టిభువనైకసుప్రసిద్ధానమాన
చాపవిద్యాప్రవీణ విస్తారసార
విమతసమవర్తి శ్రీమహావిష్ణుమూర్తిఁ
బ్రస్తుతావస్థఁదొలఁగింపఁ బ్రస్తుతింతు॥

పద్మ- నీస్తోత్రములు సమయానుసారముగ నెఱవేర్పవచ్చును. అదిగో చూడుము. తురుష్కసేనాప్రయుక్తములగు శతఘ్నిగుళికలు విజృంభించి యెటులంతఃపుర భిత్తికలకుం దాఁకుచున్నవో. మనమిట నిలువఁజనదు. పోదమురమ్ము.

విమ- అంతఃపురమునకు మార్గముతీయుము.

నిష్క్రమింతురు.

తృతీయాంకము.

సమాప్తి.





శ్రీమత్పరదేవతాయైనమః.

# పాదుషా పరాభవము.

## చతుర్థాంకము.

వెంక- (ప్రవేశించి దృష్టి నిగిడ్చి) ఎవరావచ్చునది. ఓహో. అచ్చన్న లాగున్నాఁడే. అచ్చన్నా! యెక్కడఁ గానుపించుట లేదేమి. దర్శనమే లభియించుట కష్టమైనదే. నీవొక పాదుషా వైనట్లున్న దేమిరా!

అచ్చ- (ప్రవేశించి) ఏమి.

వెంక- ఏమున్నది. ఒక్కగ్రామము నుండి యొక్కమ్మగారింటో నొక్క పారి యరణమువచ్చినపునమె యొకరికొకరు కనుపడుటమానిన నేమనుకొనవలయును.

అచ్చ- ఓరీ! యెఱుఁగని వానిరీతి మాటలాడుదు వేమిరా! నెలరోజుల నుండి జ్వర మేడిపించుచున్నది. మొన్న నేపథ్యముతినినాఁడను. నేఁడే దివాణములోనికి నెమ్మదిగ వచ్చుచుండ నాపై నీ నిష్ఠూరమేలరా.

వెంక- నీవు దివాణములోనికి బయలుదేరినరోజు చాలమంచిది సుమా! మంచిగడియలో వచ్చినాఁడవు. సమయమునకు లేచి దెందులకురా!

అచ్చ- ఏమి వెంకన్నా! నన్నంతి యెక్కుడుగా నూరించుచున్నాఁడవు. ఏమైన రెండు డబ్బులు దొరకు వ్యవహారము వచ్చినదా? మనయుదయపురియమ్మగారి చలువ యున్నఁ జాలుఁ గాని మన కేటి కొఱంతరా!

వెంక- బాగుగాఁ బల్కినావురా. నేను చెప్పఁబోవునది యుదయపురి యమ్మగారి చలువవలనఁగలిగిన లాభమే! ఆమెతల్లికడుపు వేయేండ్లు చల్లఁగా నుండవలెనని గ్రామదేవతకు దండముఁ బెట్టెదను.అహాహా.యెంతసామ్ము.ఎంతదయ.మనము చెరియొక యిల్లు కట్టుకొనవచ్చును.

అచ్చు- సంగతియేమో చెప్పవేమిరా?

వెంక- మొన్న నీమధ్య మనపాదుషాగారి కిందిరయను నాఁడుదిదొరకి నదని నీకుఁదెలియునా?

అచ్చు- నేను జ్వరములో నుండఁగ మాయమ్మచెప్పినది.

వెంక- ఆయిందిర మనమ్మగారికి నౌకరిచేయుట కేర్పఱుపఁబడెను.

అచ్చు- అయిన!

వెంక- ఆమెమిగుల చక్కనిదగుటచే పాదుషాగారు మోహించిరి.

అచ్చు- ఛా.

వెంక- నీతోడురా.

అచ్చు- మోహించిన నేమయినది.

వెంక- ఏమగును. మనమ్మగారికి సవతిపోరు వచ్చినది.

అచ్చు- అట్లయినఁ గష్టము సుమా.

వెంక- కాననే దీనికి మనమ్మగారొక యుపాయముఁ బన్నిరి.

అచ్చు- ఏమిరా! యది.

వెంక- నిన్ను,నన్ను,ఇంక నిద్దఱుతురకవాండ్రను రాత్రివేళ నిందిరను దీసికొనిపోయి యమునలోఁ బాఱవేయుమని యమ్మగారి సెల వైసది.నల్గురకు నెనిమిదివేల రూపాయల నిచ్చెదమనిరి.

అచ్చు- ఇచ్చిన నిచ్చిరిగాని మనకు పాపము రాదఁటరా!

వెంక- నీపాపము నీవు తగలఁబడ డబ్బు వచ్చుచుండఁగ నేమిపాపము. ఇప్పు డిప్పుడు నాలుగుడబ్బులిచ్చినఁ జాలుఁ బెద్దపెద్దవాండ్రే తప్పుడు సాక్ష్యములఁ గూయుచుండ మనకేమిరా!

అచ్చు- ఏమో నీయిష్టము కాని మనసుచంపవలయునని చూచుచుండ

నామెను బాగుఁజేయవలయునని యొంతముంది చూచు చున్నారో? ఏదియెట్టులున్నను శుభముగ బ్రతుకవచ్చును. ఈరాత్రికేనా?

వెంక- ఈరాత్రికే. రారా విచారింతము.

(ఇరువురు నిష్క్రమించుచున్నారు)

ఇదివిష్కంభము.

---

౧రంగము. సేనానిగృహము

(హసనల్లీఖాన్ ప్రవేశించును)

హస- (స్వగతము)ఇందిరా నీచరిత్రము మిగులవిచిత్రము. త్రిలోకైకసంభావితము. అహాహ నీరాజభక్తి నీసత్యపరిశీలత నీసాహసలక్ష్మి వైరులే వేనోళ్లఁబొగడుచుండ నీపతినైననేనెంతయానంద మొందవలయును. నీవపురంగున కొసంగిన జ వా బు న కె సం త సిం తు నా! ఉ ద య పు రి కిఁ బరిచారికవైనందులకు సంతాపింతునా? నిన్ను రక్షింపఁజాలని నాయసక్తతకుఁ జేతంబునఁ జింతింతునా? (కొంచెము సేపు విచారమొంది) మేలు వీరయువతీ, మేలు, నీయట్టిసాధ్వీమతల్లి లీభగతిమాతకుఁ గలుఁగ నిఁకేమి కావలయును. అచిరంబున నున్నతస్థితికి రాకమానునా? చంద్రావతి యజితసింహుల రక్షణార్థమై నీవుచూపిన బుద్ధికుశలత, ఔరంగునియెదుట తత్సతిమెదట నీవుకనపఱచిన సాహసము, వర్ణనాతీతము. మాబోంట్లకేని యసాధ్యము. ఇందిరాలలామా! నిన్నెన్నాళ్ల క్రిందఁ దిలకించితినో? అకటా నిన్నెన్నఁడాదరించితినో? కట్టా నీస్పర్శసుఖ మెన్నఁడనుభవించితినో? మేలముగా నీవారోజున సమరపరాఙ్ముఖుల మొగము వీరకాంతలు చూడరనవేల! అందులకుఁ గుపితుఁడనై యిట్టితురకవేసమున నేను మసలనేల? అయ్యో, నేనేయున్న నీకిన్ని బన్నములా?

ఇట్టి యవస్థలఁ గలనైన నవ్వనకైన నెఱుంగకుందువు. కటకటా నీదిక్కెయ్యది. నిన్నిప్పుడు తప్పింప నుపాయమెద్ది! (అని లేచి యటునిటు తిరుగు చున్నాఁడు) నేఁడు పున్నమి కాఁబోలు చంద్రికాప్రభావ మింతగానున్నది. (అని వెలికివచ్చి) ఈజాబిల్లి వెలుఁగు వెల్లికలు " సతిసిఁ గాపాడలేని పతిని గదా"! యనినన్ను గనిరేయియనుచేడె హసించునటు లొప్పుచున్నవి—అయ్యో పులిమీఁదఁ బుట్రి యన్నట్లు జాబిల్లి బాధయటుండఁగా మన్మథుం డెచటనుండి ప్రవేశించెను. ఛీ! మన్మథా

మ॥ హతమూర్ఖా! ననునేయఁ బౌరుషమె? గాఢాలింగ నానందవ
శ్యత నన్యోన్య హితానురాగ లతికా సంబద్ధులై స్వేచ్ఛగా
రతిసౌఖ్యాంబుధిఁ దేలు దంపతులఁ జేరఁ బొమ్ము బాహాబలో
ద్ధతి తెల్లంబగు నుర్విపైని హరిపుత్రా పుష్పబాణాసనా॥

(ఉలికిపడి) నావిరహావస్థ ద్విగుణీకృతమొనర్ప నీగురుద్రోహి యెక్కడఁ బ్రాప్తించె. అకటా! యీవియోగ సంతాపము దుర్భరముగ నున్నది.

సీ॥ జారచోరానీకసంతతి చింతింపఁ
జక్రవాకంబులు సంతసింప
నరవి కల్వవితతి చంకలఁ బాటింప
వీఁకఁబద్మంబులు పెదవివిఱువఁ
దవిలి రేచేడె స్వాంతమున సంతోషింప
దంపతులెల్ల ముదంబు నంద
పాంథు లమితమోద పాథోధి నోలాడఁ
బెండ్లికై పటులెల్లఁ బీఁకులాడ
తే. గీ॥ విరహిణీజన హృదయ నిర్భేదకుండు
మీనకేతుని నెయ్యంపు మేనమామ

షోడశ కళాసమేతుండై సొంపులీను
చంద్రుఁ గనుఁగొంటి జీవింపఁజాలకుంటి॥

ప్రాణపదమా! ఇందిరా లలామా! మనమొకనాఁటి నిండు పున్నమరేయిని మల్లెపందిరిదండ పరుండియుండ మాటిమాటికి నన్వీక్షించు చుండ నిన్నుబంధింతుసిదిగో చూడుమని పూదండలో బంధించి "బాధించితినా" "నొచ్చితివా"? యని తమిమీరఁ గౌఁగలించి నన్ను "మచ్చిత్తచకోర షోడశ కళాకలిత సంపూర్ణచంద్రా! నవబాల శిరీష కుసుమపేశల విజిత మృదుశరీరా! సౌందర్య శేముషీ నిర్జితాసమాన సుమశరాకారా! నిగ్రహానుగ్రహ సమగ్రామిత్రదుర్వారోగ్ర వీరాగ్రేసరా?" అంచు వివిధానేక కేళీవిలాసలాలసుంగావించిన నాఁటిసుఖమాటపాటలనేని స్వప్నవ్యాప్తిలోనేని వేయేండ్లకేని ద్వితీయ జన్మమునకేని మఱువఁగలనా! కట్టా! ఏమనుకొనిన నేమిలాభము. సర్వము విధికృతము. (చెవియొగ్గివిని) ఏమికారణమబ్బ! నడిరేయి యీసందునఁ బాదములధ్వని వినవచ్చెడిని. ఇదిగో గృహముల ప్రక్కనెవరో కొందఱొకవ్యక్తిని మోసికొని పోవుచున్నారు. వీరీనిశీథసమయంబున నిశ్శబ్దముగ నిటులేగుట కెవ్వరైయుందురు? చోరులు కావలయును. అట్లైన నేనేల చూచుచుఁనూరకొనవలయును. ఆయుధపాణినై వీరినివెంబడించి వృత్తాంతమరసి తదనుగుణముగ సంచరించెద.

(నిష్క్రమించును)

---

రంగము. అరణ్యము.

(ఒకస్త్రీని నలువురుమనుష్యులు మోసికొనివచ్చి దించివిశ్రమింతురు)

(హననల్లిఖానుప్రవేశించును)

హాస- వీండ్రునలువు రొకవ్యక్తినీ యరణ్యమునకు మోసికొనవచ్చియటబడలికఁదీర్చుకొనుచున్నారు. వీండ్రుదొంగలైన యొడనింత దనుక తీసికొనివత్తురా! వీండ్రుమోసితెచ్చిన వ్యక్తి స్త్రీవ్యక్తియో పురుష వ్యక్తియో! ఎవరైన నేమి క్షణము

నిబ్బరించిన యథార్థము తెలియఁగలదు.

వెం॥- ఓసీ. ఉదయపురిరాణిగారి సెలవుప్రకారము దీసిసి యమునా నదిలోఁబాఱవైచి పోవుదము రండు.

అచ్చ- అటులనే గావింతము. ఒరే మనకుఁ గావలసినంతడబ్బు కానిండు,

1మహ- జల్దీ పక్ సేసి యెల్దామ్ రండోయి.

2మహ- పట్టుభాయి పట్టు.(అనియెత్తఁబోవుదురు)

హస- (స్వగతము) ఈదురాత్మురులందఱేకమై యొకదిక్కులేనిదాసిం దెచ్చి యమునానదిలోఁ బాఱవేయ సిద్ధపడుచున్నారు ఆ యబలయెవ్వతెయైనను రక్షించుట కర్తవ్యము. (కత్తి జళిపించుచుముందునకు దుమికి)

మ॥ సరియే బాలిక నొక్కదాసని ధనాశాపాశసంబద్ధులై
కరుణాదూరతఁ జంపఁగాఁదలఁచు దుష్కర్మంబు, వీక్షించిపో
వరు నాబోఁటులుమిన్నకే నిలుఁదు మద్బాహాబల ప్రౌఢను
ద్ధరశౌర్యోన్నతి మీకుఁజూపియబలన్ రక్షింతు వీక్షింపుఁడీ॥

(పాఱిపోఁజూచునల్లురఁజెండాడును)

అకటా! ఇయ్యమ మూర్ఛిల్లిఁటు లున్నదే! ప్రాణమేసి దక్కునా! నాశ్రమవ్యర్థా యగునా! (ముక్కుదగ్గర చేయియుంచి) ప్రమాద ముండకూడదు.

కం॥ యమునానది నిర్మలశో
యముఁదెచ్చి త్వరగ నొసఁగితినా? ప్రాణాపా
యము లేదీసతికి, నుపా
యముకూడను వేఱుగాన నర్థనిశీథిన్॥

ఈయమ కుత్తుక యెండి యుండవచ్చును. ఇంచుక జలముఁదెచ్చి యొసంగెదఁగాక (నిష్క్రమించి ఆకుదొప్పలో నీరుంచికొని ప్రవేశించును)(కొంచెము జలము నోటనిడి)హా! సతీ! నీవెనా! (అసదుఃఖపడును)

ఇంది- (కూర్చుండి) నిర్హేతుక పరోపకారపారీణా! నమస్కరించెదను. నేనింతదనుక మాటలాడలేక పోయినను నీచెయిదములఁ గనుచునే యుంటిని. సహజకఠినచేతస్కులగు గోమాంసభక్షకవంశమున నీవు తప్పఁబుట్టితివి. పుణ్యమూర్తీ! భవదీయ నామాక్షరములు వినిపించి కర్ణరసాయన మొనరింపుము.

హాస- (తనలో) నేను ముందు రూప్‌సింగుననియు నీభర్తననియుఁ జెప్పుటకంటె మాఱుపేరుఁ జెప్పికొని యీయమ యీలువుఁ బరీక్షించెదఁగాక. (ప్రకాశముగ) యువతీ! నాపేరు హాసనల్లీ ఖానుఁడు. ఎవరైన నేమి! నే నెంతటివాఁడనైన నేమి! సర్వమును బూడిదెను పన్నీరుఁ బోసినట్లుగదా!

ఇంది- (స్వగతము) ఇతఁడు నిజముగఁ దురకయే యైన నిట్టిసాత్త్విక స్వభావము మాదేశభాషయందు శుద్ధముగ నుచ్చరించుటయు నలవడునా! (యోజించి) తురుష్కులలో మాత్రము సన్మార్గులు, సర్వభాషావేత్త లుండకూడదా! మహాత్ములే మతమున లేరు. (ప్రకాశముగ) మహానుభావా! మీరిట్లెల్ల సర్వమును రోసెదరు. నన్ను రక్షించినందులకు మీ కెట్టి ప్రత్యుపకృతి నేని చేసితీఱెద, సెలవిండు.

హాస- నాకుఁ దప్పక ప్రత్యుపకార మొనరింతువా!

ఇంది- అందుకు సందేహమా!

హాస- యువకులు యువతులను కోరునుపకార మేదియో యదియ కోరెద.

ఇంది- (స్వగతము) ఇతఁడు దురుద్దేశముఁ గలవానివలె కన్పట్టుచున్నాఁడు. కాకున్న నిటుల భాషింపఁడు (ప్రకాశముగ) నీమాటలు నాకర్థమగుట లేదు.

హాస- ఈనామాటలే యర్థమగుట లేదా? ఈయర్థము బోధించు ప్రసంశయేదియేని యర్థముకాదా! ఏమి మాటాడవు.

ఇంది- అయ్యో! నీపాండిత్యద్యోతక వాక్యముల యర్థము నాకేమి తెలియును?

హాస- అట్లయిన నీగోలయేల! స్పష్టీకరించి చెప్పెద వినుము. భామా. లావణ్యసీమా. తరుణీలలామా!

పాదపవృత్తము.

దుర్భర మాస్మరు దోర్బలముం సం
దర్భమెఱింగి, యనంగుని కేళీ
నిర్భరసౌఖ్యము నీవిడినం నే
నిర్భయమందెద నీశరణార్థీ॥

ఇంది- (చెవులుమూసికొని) పాపము శమించుంగాక. పాపముశమించుం గాక.

హాస ఈపాటి మేలుం జేయంజాలవా?

ఇంది- అన్నా! ఈకోరరానికోరికందప్ప మఱియేదికోరినను సాధింతు.

కం॥ కటకట యీచెఱనడతలు
కటకటంగూర్చుం బరకాంతంగాంక్షించిన ప్రా
కటబలులెవ్వ రమితసం
కటములకుం లోనుగాక కడచిరి చెపుమా॥

హాస- అన్నమిన్నా! మన్ను కానున్న నన్నుం గ్రన్నన చెన్నటి తురుష్కమృత్యుదేవతా క్రూర దంష్ట్రికాద్వయినుండి కాపాడిన నన్నుద్దండి తేజుకోదండ విసర్గతామేయపుష్పసాయ కానల మహాంభోధిమధ్యంబడి మ్రగ్గుచుండం గరముగ్రహించి దరిం జేర్పంజాలవా?

ఇంది- హా. హా! (చెవులమూసికొని)సోదరా! నావంటి పవిత్రకాంత నిటుల సాహసించి వాకొనుట శ్రేయముకాదు. ఇంక నాప్ర సంగము మాఱుము.

హాస- సతీ! నీవువెయ్యిపురాణగాథలం జెప్పినను నేనువినను.

మానినీవృత్తము.

మానుము నేబలిమాలెదనీబిగు మానముమానిని మారునిబా
ణానలవారిధి యందున మున్గితి హా దరిం జేర్పుమి యర్థ్యాడనే॥

ఇంది- మానగ యీచెడుమార్గ మపాయము మానవజాతికి మందమతీ!
కానవొ కామవికారము చేతను గన్నుల సోదరిఁగాఁ గనుమీ॥

హాస- అయ్యో! నన్నేలవారింతువు.

తోటకవృత్తము.

వినుమా కొనుమా మనవిన్ కరుణన్
గనుమా ననుదీనుని కాముఁడు న
న్ననవిచ్చుట లేదిఁక మానకబ
ల్మిని నేనిపుగూడెద మేల్కానుమా॥ (పైకిఁబోవును)

ఇంది- (తప్పుకొనికోపముతో)

పంచచామరము.

మహమ్మదీయ దుర్మదమ్ము మానరా పరమ్మునం
దిహమ్మునందునన్ సుఖమ్ములిమ్ములన్ లభించురా!॥

హాస- (ఆర్తముతో)

ఇహమ్ము దేలనే పరమ్ము దేలనే మహమ్మదీ
యహస్తమంచు నాశయింప కాదరింపుమాగనా॥

(అని చేయిఁజాచును)

సుగంధివృత్తము

ఇంది- ఔర క్రూర మేరమీఱినావె! కోరిచేరి ని
ష్కారణంబు సాధ్వి చేత శాపమంద నేటికిన్॥

హాస- మేర కాదు సుమ్ముకొమ్మ మేలగాఁడ మారదు
ర్వారదుర్ధర ప్రసూనబాణవహ్ని ప్రగ్గితిన్॥

ఇంది- మత్ప్రార్థనము వినవా!

హాస- నామనవిఁగైకొనవా!

ఇంది- ఇంత మొండితనమా!

హాస- సతీ! నీహృదయ మెంత కఠినమైనది.

ఉ॥ అంబురుహానన మోము చిగురాకున మోవినిఁ జంపక ప్రసూ
నంబుల మేను చాఁపనయనంబుల నల్లపికల్వచేత దా

తంబులమల్లెమొగ్గలుఁగ దాసృజియించి విరించి నీమస్వా
తంబునుమాత్ర మర్కట మొనర్చె శిలాకృతి యంచుఁ దోఁచెడిన్॥

(పైకి రాఁబోవును.)

ఇంది- (తొలఁగి)అయ్యో! ఇఁక నేమి చేయుదును.

హస- చేయవలసిన చేత నీకసాధ్యము కాదు.

ఇంది- అన్నా! నిన్ను నేను బతిమాలెద.

హస- అమ్మలమిన్నా! నిన్ను నేను బతిమాలుచున్నాఁడ.

(ముఖము కప్పుకొనఁబోవును)

ఇంది- (కోపముతో వెనుకకుఁ దిరిఁగి)

కం॥ ఉపకారికిఁ జేయఁగరా
దపకారమటంచు నైన నయ్యయ్యో పా
పపుచేష్ట లుడుగనైతివి
కుపురుష! నీయఘము కట్టికుడుపును సుమ్మీ॥

హస. నీమాట నాకర్థము కాలేదు. నాకోరిక నీడేర్తునను చుంటివా?

ఇంది- (కోపముతో) అర్థము కాలేదా? వినుము.

శా॥ పైపైకిన్ జనుదేరఁగావలదురా పాపాత్మకా! నీకుఁ "బ్రా
ణాపాయమ్ము తటస్థమౌ" ననుచు సుమ్మా యర్థ మమ్మాటకున్॥

హస- (నవ్వుచు) పెట్టుమిదిరి పుంజైనదే!

ఈపల్కుల్ కడునద్భుతంబబల నీవేమీ? ననుంగెల్వఁగా
నోపన్ జాలుటయేమి డాంబికము లేమో లేక హాస్యోక్తులో॥

ఇంది- నాశక్తి వ్యక్తపడునంతవఱకు హాస్యోక్తులే.

హస- వాగ్వాదమేటికి. అంతపరాక్రమురాలనైన నీకుఁ బ్రాణా
పాయ మొనరించు వారిఁదెగటార్చుటలో కరిదనుక రానీయనేల?

ఇంది- నిద్రావస్థయందు నన్ను బాధించికొనివచ్చిరి. నేనే మేల్కొని
యున్న వాండ్రైకాక భవాదృశులునూరుగురేని నన్నుఁదాఁ
కఁగలరా? దైవమున కేనిచిక్కుదునా?

హస- చిక్కక చిక్కబలముఁ జూపింతువా? (అని నవ్వుచున్నాఁడు.)

ఇంది- (రోషముతో) అదే పిరికిశక్తికాదు. తృణీకృత దేవాసుర స్థైర్య త్రిలోకైకసంభావితాకుంఠితామేయ ధనుర్విద్యాశక్తి వ్యక్తపఱుతు.

హాస- కానీ! నీవంతటిదానవైన నగుదువుకాక. నన్నుఁదాఁకి జయించుటకుఁ బ్రస్తుతము నీకడ రణసామాగ్రియెయ్యది!

ఇంది- వెఱ్ఱివాఁడా! మానమె ప్రాణముగ భావించు సత్క్షత్రియాంగన వైరిమారణ సాధన విహీనయై నిద్రావస్థనేని మసలునా? (అనియొడ్డాణముగ నున్న కత్తిని జళిపించును)

హాస- (తనలో) మేలు బాలా! మేలు సత్సతీ! యిందిరా! నీయీ ప్రస్తుతవాక్యంబునకు నీభర్తనైనందుల కెంతగర్వింపవలసియుండునో నేను నేఁడెంతసంతసించుచుంటినో ప్రకృతికేయఱుక. పైని నాయట్టిస్వానుభవైకవేద్యులకు విశదంబ. తదితర దుస్తరము. సతీ!నీవవతారస్త్రీవికాని సామాన్యరాలవుకావు. చతుర్దశభువనంబు లేకచక్రంబుగ నేలఁజాలిన నీవు నాసతివగుట నాపూర్వ జన్మ సుకృతము. (ప్రకాశముగ) ఖడ్గగ్రహణముతప్ప కరగ్రహణమొనర్పనెట్లికదా ?

ఇంది- వేఱుగఁ జెప్పవలయునా !

హాస- మగవారితోఁ బోరాడి మగువలుగెల్చుట లుండునా ?

ఇంది- గెల్చుటలుండునా యనకుము. ఓడుటలుండునా యనుము.

హాస- ఆఁ ఏమనెదవు.

ఇంది- ఆఁ ఏమి వినుము.

తే॥గీ॥ తల్లితండ్రిగురువు మఱి దైవమైన
జీవితేశ్వరుఁడగు రూపసింగుదక్క
వీరదుర్వారవైరివిహారకేరి
నన్ను డీకొనిసిల్చు మానవుఁడు కలఁడె!

హాస- (తనలో)హాయి.హాయి.ఈమితిమీఱిన సంతోషవశమునఁ బ్రాణములు లేచిపోవునాయేమి. ఇందిరా! లోకైకజననివైన నీ

యాలుపు పరీక్షింప నెంచినందులకుఁ జెంపలు వాయించుకొనెద (ప్రకాశముగ) సతీ! యుద్ధము నకు సన్నద్ధపడుము.

ఇంది- సర్వంబు నిదివఱకే చక్కఁ బెట్టఁ బడినది.

హాస- (తనలో) ఈయమశక్తిఁ బరీక్షింతుఁగాక (ప్రకాశముగ) రారమ్ము

(ఇర్వురు పోరాడుదురు)

వీరయువతీ! ఇంత సేపు ప్రయత్నించితివి. నీవు నన్ను జయింపఁగలవా?

ఇంది- వీరపురుషా! నిన్ను నేను జయింపఁజాల.

హాస- దీనినిఁబట్టి నేను రూపసింగునని భావింపరాదా?

ఇంది- ఛీ. మహమ్మదీయహతకా! నోర్మూయుము.

హాస- ఇందిరా! ఆఁ (నాలుక కొఱుకు కొనును)

ఇంది- నీవు నానామ మెట్లెఱుంగుదువు.

హాస- నీవిదివఱకుఁ జెప్పియుండినందున.

ఇంది- నేను నీకు నానామముఁ జెప్పితినా?

హాస- కాదు కాదు. నేను రూపసింగునోటచే గ్రహించితిని.

ఇంది- (హాసనల్లీముఖముఁ జూచి ఆలోచించును)

హాస- ఇందిరా! ఇందాలోచనకు సందేలేదు. కాలగతిచే నేనొకానొక యుద్ధంబున నోడి నిన్నుఁ జేరరాఁగ సమరపరాఙ్ముఖుల మొగము వీర కాంతిలు చూడరంటివి. దానికే నేను రోషించి చూచువిధంబున నే చూచునాఁటికే చూడఁగలనని చెప్పి దేశాంతర్గతుండనై దేశోద్ధారణ మొనర్ప నిదియదనని హిందూస్థానిభాష నేర్చికొని గడ్డముఁ బెంచికొని తురక వేసంబున సపురంగునిఁ గొలచుచుంటి. నీవిచ్చోటికిఁ దేఁబడితివని రాజసింహునివలనఁ దెలిసికొని నిన్నెట్లు రక్షింపఁగల్గుదునా! యని యాలోచించుచుఁ దలవాఁకిట వెన్నెలలోఁ దిగుగాను తఱి నిన్ను మోసికొనివచ్చు నీదుర్మార్గుల వెంబడించి రక్షింపఁగలిగితిని. నీశీలంబు పరీక్షించుటకిటులఁ బ్రసంగించితిని. నామాటఁ బాటించి నన్నుఁ బరిగ్రహింపుము.

ఇంది- (తనలో) ఇతఁడు నా భర్త కాఁడనుకొందునా? రహస్యముగ మాయిరువురిలో జరిగిన దంతయు జరిగినటుల వచించె. మొగమునఁ గొన్ని పోలికలుకలవు. మాటమాత్రమించుక మాఱినటులున్నది. యథార్థము గ్రహించుటకు నాబుద్ధిబలము చాలకున్నది. (ప్రకాశము) నేనిందిరనని యెఱింగినవాఁడ వీకథ యెఱుంగకుందువా? నీవు వాకొనినచరిత్రము జగద్విదితం బెగదా.

హాస- అనఁగ నింక నమ్మఁజాలనియట్లు కాఁబోలు.

ఇంది- ఔను.

ఆ॥ వె॥ ఊరుపేరు లేనియొకఁ డెవ్వఁడో వచ్చి
నాథుఁడనిన నెవతె నమ్మఁగలదు
సాగరావు మాయసంభాషణము లిటుఁ
దమరు తెలివిఁగలిగి తరలవచ్చు॥

హాస- వేగిరపడకుము. ఈకత్తి యెవ్వనిదో పరీక్షింపుము.

ఇంది- (పరీక్షించి) యిది మన్నాథునిదే. ఖడ్గరాజమా! ఎన్నాళ్లకెన్నాళ్లకు నాకు దర్శనభాగ్య మొనగూర్చి పాపదూరంగావించితివి. (అనిఖడ్గమును గన్నులకద్దుకొని) కరవాలమా! మనమిరువురము రూపసింహుని కరాగ్రవాణ మొనర్చితిమి. కానఁ దుల్యభోగినులము. నావలెనే నీవుకూడ కాలవశమునఁ దురికలకుఁ జిక్కియుండవుగదా! (హాసనల్లితో) మహాత్మ్మదీయా! మన్నాథుని ఖడ్గము నాయదృష్టముచే నీచేఁ జిక్కియుండును.

హాస- నేను నీనాథుఁడను కానా?

ఇంది- పొల్లుమాటల వాసీయకుము. తెలివిఁ గలిగి బ్రతుకుము.

హాస- కం॥ నవలావణ్యాబ్ధీ "మా
నవచంద్రా"! యంచు ముద్దునఁ బిల్చెడిదా
నవహా నొప్పింతువె? కఠి
నవచోహతి నేఁడు కారణవిహీనముగన్॥

ఇంది- (తనలో) నేను నానాథుని ముద్దుగఁ బిలుచుకొను పేరుఁ గూడ

నీతఁడు వచ్చెంచె. ఇతఁడు నాభర్తయని నమ్ముదునా? నమ్మక పోదునా?

హాస- మాటాడవేమి? నీనాథుని ముద్దునామముఁ జెప్పినను నమ్మకము లేదా?

ఇంది- లేనిమాటనిజమే. నీవొక తస్కరుండవనియుఁ దద్వృత్తిచే నెప్పుడో మాసివాసమున కేతెంచి నానాథుని ముద్దునామము వింటివని యూహించితిని. తేరున్న నికేటులఁ దెలియును.

హాస- పోనీ. భవదీయ నాథుని వామభుజమున నైదాఱంగుళముల పొడవుఁగల కత్తిగాటుమచ్చ కలదు. అదిచూడుము (అసిచూపించును).

ఇంది- (తనలో) ఉన్నట్టులనే జ్ఞాపకము. (ప్రకాశముగ) నీకు నీవు చెప్పినటులున్నది ఎన్నఁడును నాపతిని నేనీవిషయంబున నంత పరీక్షగఁ జూచియుండను.(తనలో)నాకిది సర్వ మింద్రజాలము గఁ గన్పట్టుచున్నదే. (ప్రకాశముగ) సాహెబా! ఇన్ని గుర్తులఁ జెప్పితివి. నాశరీరముపైఁగాని నావిషయమునఁగాని యేదైన గురుతుఁ జెప్పఁగలవా?

హాస- ఒక్కటికాదు వేలుగుర్తులు చెప్పనోపుదును. కాని నేనెన్ని చెప్పినను నీవు ఖండించుటచే నితరులెవ్వరుఁ జెప్పఁజాలని యొకగుర్తుఁ జెప్పెదను. నీబుజముపై (అర్థోక్తియందు)దగ్గరకురమ్ము. చెప్పెదను.

ఇంది- (వినుటనటించును).

హాస- (ఏమియో చెప్పి) ఈగురుతైనను జాలునా? ఇంకను గావలయునా?

ఇంది- నాథా! యింక వేలుగుర్తు లనవసరము. (సిగ్గునటించి) మనోధవా! నాఁడు నిన్నుఁ బోనాడినందులకై నాచర్మమును బాదరక్షలుగ నొనర్చి నీకొసంగెదను. పరిగ్రహింపుఁడు. నేఁడు నిన్ను కఠినవచోహతి నొప్పించిన పాపోపశమనార్థమై పంచ

భూతములకు నాశరీరమాంసఖండంబులు బలియొసంగుచున్న దాన నన్ననుగ్రహింపుము. నిన్ను నిష్ఠురాలాపంబులచే విదేశాంతర్గతుఁ గావించిన యీజిహ్వను నీవాఁడివాలుచే వేయిచీలికలు గావించెద. కష్టమును బాపుకొనెద.! నాథా! రక్షితానాథా! తృణీకృత సర్వవైరి భూనాథా! భర్తృద్రోహ మొనర్చితి. పరమపాతకురాలను, తుచ్ఛురాలను, నాముఖసందర్శనము నీకుఁ బాపహేతువు. నన్నుఁదాఁకి నీదేహమును గలుషీభూతముఁ గావించుకొనకుము. (ఏడ్చుచు) నీయంతటి నిర్హేతుకజాయమానకటాక్షయుతుని, నీయంతటి శాంతపరావతారమూర్తిని, నీయంతటి సద్గుణగణగరిష్ఠుని, నీయంతటి జగదుపకారపారీణుని యింతలు గావించిన యీచండాలురాలు, ఈవిశ్వవ్యతిరిక్తురాలు, ఈదుర్విదగ్ధురాలు, భరతమాతకుఁ భారముగనుండుటకంటె నూఁకటయే పదివేలు. ఇట్టివా రూడిన భరతమాతకుఁ గొంత బరువు తీఱఁగలదు. ప్రాణేశ్వరా? నాతప్పుల క్షమించితి ననుము. నిశ్చింతగఁదనువుఁబరిత్యజించి పాపంబునాపుకొందును.

రూప- (లేచనెత్తి)హా దుర్భరము. ఇందిరా! నీయందు నేరముకూడనా?

సీ॥ యశవంతసింహానుతాదుల రిపునుండి
రక్షించియున్న నీరాజభక్తి
నయనపాలుని నాశనమునల్ప బన్నన
యానాఁటి నీయసమానయుక్తి
పాదుషాకిడిన జవాబుల నీవుస్థా
పించిన యట్టిసర్భితశక్తి
పతిమైన నీవుఁ గన్పఱచిన నేటలో
కాతీతమైన గాఢానురక్తి

గీ॥ విదళితారిసమూహమహా ప్రక్రమోక్తి
వినినవార్వినుచున్నవార్వినెడివారు

కలికి నీయొరు నేరంబుకలుగునన్న
నమ్మఁగాఁబోక వైపెచ్చు నవ్విపోరె॥

ఇంది - నాపైఁగల నిర్వ్యాజ కరుణచే నట్లనుచున్నారు. నాథా!

సీ॥ కన్నార నన్నాళ్ళ కెన్నాళ్ల కీక్షింప
వలనయ్యె భవదీయ వదనవిధుని
ఎప్పటి కెప్పటి కిప్పుడు క్రోలఁగాఁగల్గితి
నీదు వాక్యామృతంబు
ఎచ్చోటి కచ్చోటి కిచ్చోటనందఁగాఁ
జాలితిఁదావకస్పర్శసుఖము
ఏనాఁటి కేనాఁటి కేను త్తమాంగంబు
పైఁ దాల్పనయ్యె నీపాదరజము
గీ॥ నాదునోము ఫలించె నీనాఁటికోడ
శక్తిపూజాఫలంబు నొసంగె నేఁడు
కోర్కులన్నియుఁ దీఱెను గొఱంత లేదు
చెలికి సెలవేమొ సెలవిమ్ము జీవితేశ॥

రూప- నీవలనఁ దెలిసికొనవలసిన సంగతులు పెక్కులుకలవు. నేను జెప్పవలసినవి పెక్కులు కలవు. కాన ముందుతెమ్ము.

ఇంది- ఆజ్ఞయే యపేక్షితము. ఎట్టికార్యంబేని యొనరించెద.

రూప- తెఱవా! నీకింతలో నింత యపాయమేల తటస్థించె?

ఇంది- దేవా! నేనుదయాపురిచెంత దాన్యమునకు నియోగింపఁబడిన సంగతి యెఱింగియే యుందురు. ఉదయపురికిఁ బరిచర్య చేయ నోపక నాయముతో నొరంగుఁడు నన్నుఁ బ్రేమించెనని చెప్పితిని. దానఁ గోపించి ఏవతిపోరు వచ్చునని నిద్దురఁ బోవుతటి నన్నీ హంతకులచే యమునలోఁ బాఱవేయుమని పంపియుండనోవు. పిమ్మటఁ బ్రాణనాథుఁడవని విన్నెఱుంగక యిట్టికృత్రిమకార్య మొనరించితిని.

రూప- ఇది కృత్రిమమని తలంపకుము. దైవము మనకు సంయోగ

మోద్భూతమై యిట్టి యపూర్వకార్య మొనరింపఁ జేసెను. (కొంచెమూఁగి) సఖీ! నీతోడ నేను మాటలాడు నంతటి విరామము లేదు. మనము దేశోద్ధారణార్థమై మిగుల సాహసకృత్యము లొనరింపవలసియున్నది. స్థిరబుద్ధితో నీవు పురము దేశహితార్థమై సంచరించి సార్థక జన్ములమైతిమేని దాంపత్యబాధమున వర్తింపవచ్చును. యిందులకు నీతలం పెద్ది?

ఇంది- నాయకా! మీయనుజ్ఞ ననుసరించెదను.

రూప- అట్లయిన నీవుదయపురి కేగి రాజసింహునితో నిట్లు చెప్పుము. "రాజసింహా! నిన్ను విమలారక్షణార్థమై రూపనగరమునకు సైన్యసమేతముగ నేగుటవిని యకారంగ జేయు నీపట్టణము ముట్టడింప రానున్నాఁడు. ఆసూరాగ్రగుప సేనల హాసనల్లియను వారు పేరు నవర్తించు రూపసింగను దేశభక్తుఁడు నీపురమునకుఁ జుట్టునున్న కొండలసందునఁగల కాలిబాటనుండి తీసికొని వచ్చును. జాగరూకతతో సైన్యమును కొండలనడుమకుఁ జేరఁగనే ససైన్యముగ నుభయమార్గముల నిర్బంధించి యాతురకజేవి బాధింపవచ్చును. పిదప మనము కృతకృత్యులమయ్యెదము" అని బహుశః రాజసింహుని సంస్థానమునకు నుదయపురిమార్గము నివెఱుఁగియే యుందువు.

ఇంది- నేనెఱుఁగకపోవుటయేమి. తమ సెలవుప్రకారము చేసెద.

రూప- ఇచ్చటనుండి యుదయపురికి నీకు దారి తెలియునా?

ఇంది- నాథా! తెలియకయున్న నేమి. నోట నాలుకయున్న దారి కేమి?

రూప- నీవు పురుషవేషమున నేగుట మేలు.

ఇంది- చిత్తము.

రూప- నీకు నాయశ్వము నిత్తును కైకొనుము.

ఇంది- తమ యాజ్ఞగా మెట్లైన నట్లొనరించెద.

రూప- అట్లయిన నిప్పుడే ప్రయాణము చేయుటకు రమ్ము. రాజసింహునకొక యుత్తరము కూడ నిత్తు. జాగ్రత్తగఁ దీసికొని పోయి

ముచ్చెదవుగాక.

ఇంది- నాయకా! లేఖ వ్రాయుట కానసుస్థలమున నాసీనులగుట యుక్తము. పోవుదమా?

రూప- మంచిది. (నిష్క్రమింతురు)

## చతుర్థాంకము.

——;o:——



శ్రీమత్పర దేవతాయైనమః

# పాదుషాపరాభవము.

## పంచమాంకము.

రంగము:—ఉదయపుర సభాభవనము.

(రాజసింహామహారాణా ప్రవేశించును)

రాజ- ప్రస్తుత మారంగుఁడు మితిమీఱిన యుద్ధప్రయత్నము లొనర్చుచున్నాఁడఁట. కారణమేమియై యుండును. ఆబాల్యమునుండియు నన్ను స్వాధీనపఱచుకొనవలయు ననునూహ వానికిని వాని దురుద్యోగ మడఁచుకుతూహలము నాకునుగలదుగదా? ఈతని ప్రయత్నములన్నియు నాపైకనియే నాతాత్పర్యము. హోఁగాక. ఇట్టి పాదుషాలు కోటిమంది యెత్తివచ్చినను మదీయ దుర్గమభేద్యము. ఉదయపురి దుర్గమనిన సామాన్యమా? రసపుత్రసైన్యమును దాఁటుటయనిన మాటలా? రాజసింహుని గెలుచుటయనినఁ జులకనా? ఎవఁడా? వచ్చునది (పరికించి) సేవకునివలెనున్నాఁడు.

(సేవకుఁడు ప్రవేశించును)

సేవ- దేవా! రూపనగరునుండి పండితుఁడొకఁడు వచ్చి తమదర్శనార్థమై వేచియున్నాఁడు.

రాజ- అవశ్యము లోనికిఁ బ్రవేశపెట్టుము.

సేవ- చిత్తము. (నిష్క్రమించి మరల సామల్పండితునితోఁ బ్రవేశించి)అయ్యా! వారే రాణాగారు.

(నిష్క్రమించును)

రాజ- అయ్యా! అభివాదముఁ జేయుచున్నాఁడను.

సామ- (తనలో) నేను పండితుఁడనని సేవకునిచే గబురంపుటఁజేసి పండితుఁడే కాఁబోలునని రాజసింహుఁడు నాకభివాద మొనర్చియుండును. నాయొద్దఁ బాండిత్యము లేకున్న నాకభివాదము లేదల్లెనా ? అయినను నే నెందుల కట్లు తలఁప వలయును. నాకుఁ బాండిత్యమున కేమి కావలసినంత. (ప్రకాశముగ) విజయప్రాప్తిరస్తు.

రాజ- అయ్యా ! యీపీఠ మలంకరింపుఁడు.

సామ- (కూర్చుండి తనలో) తొత్తుకొడుకులు రూపనగరపు మనుష్యులు నాసంగతి యెఱుఁగఁబట్టి కాఁబోలు నన్ను గౌరవింపనే గౌరవింపరు. ఇఁక నగౌరవముగ మాటలాడిన నేను వాండ్రతో మాటలాడనే యాడను. (అటునిటుఁజూచి) బలే ! ఆఁడువాండ్రి యుత్తరము లిచ్చుటకు మంచిసమయముున వచ్చినాఁడను. (ప్రకా) రాజసింహా ! ఇదిగో! యీయుత్తరము మీకిమ్మనిన దెవరో యెఱుఁగుదురా ? విమల రూపనగరాధీశుని తనయ విమల (అని తలగుడ్డ కొంగువిప్పును.)

రాజ- విమల. నాకు. లేఖ... (అర్థోక్తి) అను గ్రహింపుఁడు ( చేయిఁ జాఁచును)

సామ- (ఉత్తరమిచ్చును) ముందీయుత్తరముఁ జిత్తగింపుఁడు. పైనఁ దమతోఁ జెప్పుమని నాతోఁ జెప్పిన పల్కులు కొన్ని కలవు. అవి వినిపించెద.

రాజ- చిత్తము (ఉత్తరము విప్పి యిట్లుచదువును) నవమన్మథాకారా! రాజసింహా ! రాజకుమారా !

(ఔరంగుఁడు నలువదివేల సైన్య మంపి మాపురి ముట్టడింపించి)

తే॥ గీ॥ "తనయనిత్తువ? వత్తువ?" యనికటంచు
వ్రాసి లేఖ మాయయ్యకుఁ బంపినాఁడు
చక్కఁబడదేని కార్యంబు సామవృత్తి
బలిమినేని నన్గొనఁ బట్టుఁ బట్టినాఁడు॥

కావున సైన్యసహితముగ వచ్చి నన్ను రక్షింపుము.

సీ॥ ఎవ్వరేమైన నాకేమని నన్ను నే
క్షించి తురకకొప్పగింపకయ్య
అబలకై వైరమా? యంతటి పాదుషా
తోనని తోడురా మానకయ్య
పతివీవె యని మనఃపంకేరుహమునందుఁ
దలఁచు నామానంబు నిలుపుమయ్య
నాఁడు వనంబున నాపైని జిల్కిన
కరుణారసంబును మఱువకయ్య
తే॥ గీ॥ తోడురావయ్య నన్నుఁ గాపాడుమయ్య
యేమఁగడ పీవిపత్తున నీవెయయ్య
జాగువలదయ్య రావయ్య సాహెబయ్య
గర్వమడఁచి లోకఖ్యాతిఁ గాంచుమయ్య॥

రూపనగరము.

ఇట్లు
విన్నవించు పదసేవకురాలు,
విమల.

ఔరా! యెంతటి విపత్తు ప్రాప్తించె. దుర్భరము. ఎంతకష్టదశనుండనిదే మానవతియగు విమల నాకిట్లు వ్రాసియుండదు. (తిరిగియుత్తరముం జూచి) ముట్టడించియే యున్నాఁడఁట. కాని వీని నలువదివేల సైన్యము నాకు నాల్గు చీమలుగఁ గనిపించుచున్నది.

ఉ॥ కత్తివహించినే నిలువ ఖడ్గముతో నవురంగజేబు వం
శత్తియ మేలకాదు నిముసంబున, శత్రుకురంగజాలహా
ర్యక్షులు రాచవారికెదురా? యొకఁడైనను రాజపుత్త్రిసం
రక్షణమెవ్వరేల? యవురంగుని పాపమె చేయుఁ గావుతన్॥

ఏమని కబురంపి నాఁడు (ఉత్తరముఁజిత్తగించి) తనయ నిత్తునా! అనికి వత్తునా! యనియుఁ!

శా॥ అన్నాఁడా! తనకిమ్మటంచు విమలాహస్తంబు వీక్షింప రా
కున్నాఁడా? కనులింతకే విజయసింహుం, డాత్మజఁ జేయఁగా
నున్నాఁడా? తనకిచ్చి పెండ్లి యటు తానూహించి జీవించి పో
నున్నాఁడా? యవురంగజేబు కనుగోనున్నాఁడ నాద్యంతముఁ॥

ఆఁ తానంతటి మహా బలవత్స్వాపన్నుఁడా? అరే! మొఱకు తురకా! నీకి నక్రవిక్రమక్రమ శక్రపుత్త్ర ప్రతిమానుఁడగు విజయసింహుండు తనయనిచ్చునో మృత్యుదేవతను బ్రసాదించునో యెఱుంగుము గాక. ఓరి ముష్కర తురుష్కాధమా! నీవు విమల పాణిగ్రహణ మాచరింపుటకుఁగాదు తదంగన పాదరజము నీ యుత్తమాంగమునఁ దాల్పుట కనర్హుఁడవు. అరే దురాత్మా! సజ్జనపాత్రీకంబైన నీప్రక్కబాఁకగు శ్రీవిజయసింహరాణా వైరిదుర్వారప్రతాపోద్రేకమును మఱచితివా? మ్లేచ్ఛకుల సంజాతుండవగు నీవెక్కడ అనన్య సామాన్యోత్తమ సద్రసపుత్త్రకులప్రసూతయగు విమలయెక్కడ. హస్తిమశకాంతరము. విజయసింహుండు కూఁతు నేయిచ్చునో దుర్మరణహేతుభూత సర్వకవచభేదనప్రవీణ భీషణదుర్వారహేతిపాతమే యిచ్చునో? ఖడ్గమూని కాలూని యెదిరి సంగ్రామమున నిలిచిననాఁడుగదా తెలియఁగలదు. మఱచితివి నీకభిమానమెక్కడిది.

సీ॥ శ్రీమన్మహాశివాజీ చక్రవర్తికి
లొంగి యంతిపురిని డొంగునాఁడు
యశవంతసింహుని కసినోడి లక్షణ
పురిఁ బిక్కబలముఁ గన్పఱచునాఁడు
రిపుపుత్త్రిఘాటికోర్వక చేతఁజిక్కిన
చంద్రావతిని వీడి జాఱునాఁడు
"దారా"యనెడివానిఁ దాఁకఁగాలేక త్య
జించి కాలికిబుద్ధిఁ జెప్పునాఁడు
తే. గీ॥ నీప్రతాపక్రమంబును నీబలంబు
పోఁటుకాఁడ వచింపు మేయేటఁ గలసె

మానమునకును మఱి ముసల్మానులకును
జాలదూరమగు సంగతి స్పష్టమయ్యె॥

ఓరీ. ఔరంగా! నేఁటికి నీవు నా బారి బడితివి. ఇఁకఁ దప్పికొన నీకును దప్పింపఁ జేజేలకును దుస్తరము. నిన్నుఁ బైకొన మేము పూనుకొనవలయునా? సత్సాధ్వీలలామ యనురే కానరాని విషవహ్నియై నిష్ప్రాణమ్ముల నపహరింపదా? కానీ కాచుకొనుము.

సామ- (తనలో) ఈరాణాగారి కోపము కొంచెము నివారించినఁ గాని నేనెదుట నిలవఁ జాలను. (ప్రకాశముగ) మనవి. ఇప్పుడేను జెప్పఁబోవునవి విమల తమకుం జెప్పుమని చెప్పినమాటలే. సావధానులు కాఁ బ్రార్థింతు.

రాజ- (వినయముతో) సెలవిండు.

సామ- విమల చెప్పిన యుత్తరమునే వల్లించుచున్నాఁడను. వినుఁడు.
( సీ॥ "రక్షించిననుగాన" అనుపద్యముం జదువుచున్నాఁడు.)

రాజ- (ఆతురతతో) తననే సర్వస్వముగ భావించు నాకిట్టుల వార్త నంపవలయునా? తిరుగఁ దమరేగి నామాటగ విమలతో నిట్లు చెప్పుదురుగాక. జాగ్రత్తగ వినుఁడు.

సీ॥ కొనయూపిరియె యుండుదనుక నేనతివపై
సింగనైనను వ్రాలనీయ ననుము
తన ప్రేమముంచిన దాయలగుంపును
నిర్జించుకార్యంబు నిముసమనుము
సాధ్వులహింసించు శత్రునిర్మాధవుం
డేనాఁటికిని క్షమియింపఁ డనుము
అవురంగుఁడేమేమి యాతనితాతయేఁ
బ్రేలనేఁ దనఁ జూపఁ జాలఁడనుము
తే॥ గీ॥ బయలుదేరెననుము భీతి వలవదనుము
వచ్చుచుంటిననుము బ్రోవఁ గలననుము

మనకె విజయమనుము చింత మానుమనుము
తనకరము గ్రహింతుననుము తప్పదనుము॥

సామ- చిత్రము. చిత్రము. చిత్రము. అలాగుననె చెప్పెదను కాని యొకసందేహము వచ్చినది. నన్ను ముందుగా వెళ్లుమను చున్నట్లున్నది. వచ్చునప్పుడె తురకలవలన నల్లకల్లోల మైతిని. నాకుఁ దిరిగి యొంటరిగాఁ బ్రయాణమనిన భయ మధికమగు చున్నది.

రాజ- అట్లైనఁ బోనిమ్ము. నేనుకూడ యెల్లి పయనమై తీఱుదును. నాతోడనే తమరుకూడ దయచేయవచ్చును.

సామ- బలె. బలె. నాప్రాణములు దక్కినవి. (తనలో) నేనిదివఱకు ఉవ్విళ్లూరినట్లు నేఁడు త్రేపు తెగఁదినవచ్చును.

రాజ- అయ్యో! తమకు రూపనగరమున నేమిపని.

సామ- నేను విమల గురువుగారిని. సమయమువచ్చిన విదూషకుఁడను.

రాజ- అటులనా! చర్యలుకనుపడక పోవుచున్నా. (అనినవ్వుచున్నాఁడు)

సామ- దాఁచిన దాఁగునా? మీకుఁ దీరికగానున్నటులున్నది. ఇఁక నా దారినడక వినియెదరా? మనవిఁ జేసెదను.

రాజ- చెప్ప వచ్చును

సామ- కొంచెము మఱచిపోతిని. జ్ఞప్తికిఁదెచ్చుకొననిమ్ము. (తనలో) ఏమి చెప్పుదును. నోరు జారితిని. ఏదియో యొకటి చెప్పవలయును. కుక్కనైనపుడు మొఱుఁగకుండ నుండతరమా? నేను సేవక వృత్తి కెప్పుడువచ్చితినో అప్పుడె కుక్కనైతిని. (ప్రకాశముగ) నేను విదూషకుఁడనౌట నాకప్పుడప్పుడు హాస్యవచనంబులు దొర్లుచుండును. అందులకుఁ గోపించినచో బ్రతుకఁ జాలను.

రాజ- (నవ్వుచు) హాస్యమునకుఁ గోపమొందులకయ్యా! కానిమ్ము.

సామ- నేను వినులయొసంగిన జాబుంగైకొని కోటదాఁటినతోడనే దశ దిశలను మహమ్మదీయానీకము కానుపించె. అదియేమియో

కాని పదిమందితో పట్టపగలు శ్మశానవాటికలో నిర్భయము గాఁ దిరుగు నేనిప్పుడు భీతి పెంపున మనసులో మనసు లేక యే మిచేయుదునాయని యాలోచించి చాల తెలివిఁగల ఘటమును గనుక త్వరలో నిట్లూహింపఁ గల్గితి. ఈ తురకకొడుకులు నేను పందినైతినా! నాజోలికి రారుకదా యని యదేమికర్మమో యెన్నఁడు పొరపాటు మొఱుఁగని నేనిప్పుడు ప్రమాదమున సూకరమునైతినికదా యని నాలో నేను సంతోషించుకొనుచు నిశ్చిమిత్తముగ నేనుపందినోయి నేనుపందినోయి అని కేఁకలు వేయుచుఁ దురకభటుల మధ్యంబడి వెఱ్ఱివానివలెఁ బరుగెత్తితిని. తుదకెన్ని కేఁకలు వేసినను వారందు నన్ను బాధించికొనిపోయి సేనాపతియగు సాదత్ ఖాన్ వద్ద నిలిపిరి. ఆ త్రాఁగుఁబోతు నిముసములోఁ గనుఁగొని వీఁడు "దివానా" రా ఒకతాపిచ్చి గెంటివేయు మనియెను. ఒకతాపున కొక సారి మెలకుతాపులైనను వారిటు గెంటినను బ్రాణముదక్కెఁ గదా యని సంతసించుచుఁ గ్రిందఁబడియు నదయపురిదారివైపె పొరలాడుచుఁ దప్పుకొని బైలఁబడి నామనసులో నానోటికి వచ్చినటుల బూతులపంచాంగమును విప్పి కసిఁ దీర్చుకొంటిని. తాపులకేమి తన్నులకేమి రవ్వంతకు మాగుణము నాకున్న వారిడపాపమున వారిడె నశింతురుగాని తురకముండకొడుకులు నాదేవతార్చనపెట్టె మైలఁబఱచిరి. అందులకు మఱియేమియుఁ బ్రమాదములేదు. బ్రాహ్మణసమారాధనముం జేయించితిరా తత్పాపము నశింపఁ గలదు. ఆసమారాధనమున నాలుగైదురోజులు పెండ్లికుమారితే గురువునైనందులకు భోజనముం జేయఁ గలను.

రాజ.- (నవ్వుచు) అసాధ్యపు బ్రాహ్మణుఁడా తిండికై యెంతకథ కల్పించితివయ్యా. నిబసలో నిప్పుకోరిన పదార్థములు లభింపఁ గలవు లే.

సామ- బావనయ్యలకుఁ దిండి యేపన.

రాజ- నీసంగతి యెఱుఁగని వారందఱు నీమాటలు నిజమనియే భ్రమింతురు.

సామ- నాసంగతి తెలిసినవారు మాత్రము నేనుముందుఁ జెప్పఁబోవునవి యసత్యములని చెప్పకున్న సత్యములని భ్రమింపవలదా?

రాజ- ఆఁ చెప్పినంత చేయఁగలవు. మహానుభావుఁడవు నీవు నాదగ్గఱ నుండవలసిన వాఁడవయ్యా!

సామ- మీరువద్దనినను మిమ్ములను వదలెదనా? విమలతోఁగూడ నేనుగూడ మీవాఁడనే.

రాజ- తథాస్తు. తమకాలస్య మగుచున్నది. బసకు దయచేయుఁడు. ఎవఁడురా. ఈ పంతులుగారిని బసకుం దోడ్కొని పొండు.

సేవ- (ప్రవేశించి) చిత్తము (సామల్పండితునితో) దయచేయుఁడు.

సామ- సెలవుఁ దీసికొని తిరిగి సాయంకాలము దర్శనముఁ జేసికొందును. (రెండడుగులు నడచి తనలో నవ్వుకొనుచు) రాజసింహునకు మంచిదయఁ దెప్పించితిని. ఇట్లు నేనబద్ధములాడుట వలననే నామాట మాయూరిలోనైదేండ్లపిల్లకూడ నమ్మదు. తురకసేనను బైరాగివేసమున మాయచేసి వచ్చితిని. ఏమేమో రాజసింహునకుఁ జెప్పితిని. మొత్తముమీఁద మంచిపనులు చేయఁగలను.(ప్రకాశముగ సేవకునితో)పోదమురా నాయనా. నాలుగుమెతుకులుఁ దినిపడియుండెదను. అన్నట్లు! యీమూఁటఁ గొంచెము పట్టుకొనిరా! తండ్రీ (మూఁట సేవకునకిచ్చి నిష్క్రమించును).

రాజ- (ఉత్తరముం జూచి) ఆహా! పాప మీయాఁగన యెంతటిదురవస్థనుండి యిట్లు వ్రాసియుండ వచ్చునో. ప్రకృతీ! మత్ప్రతిజ్ఞావచన మవధారుము.

శా॥ శిక్షింతుర్ మొరకుల్ దురుష్కులజలరాశిం దూఱి డాఁగున్న నం
రక్షింతున్ విమలన్ విరోధిజన దుర్వారోగ్రమైనట్టి మ

తెలుక్షేయప్రభ వెల్లడింతు రిపురాట్కాంతారముల్ వ్రేల్చి లో
కక్షేమార్థము సంకటంబులు తొలంగన్ క్షత్రియస్త్రీలకున్॥

సేవ- (ప్రవేశించి) దేవా! తమదర్శనార్థమొక రాజకుమారుఁ
డేతెంచియున్నాఁడు.

రాజ- తోడ్కొనిరమ్ము.

సేవ- (నిష్క్రమించి రాజకుమారునితోఁ బ్రవేశించి)అయ్యా! వీరే
రాణావారు సెలవు.
(నిష్క్రమించును).

ఇంది- (తనలో) ధన్యోస్మి ధన్యోస్మి. ఎన్నాళ్లకెన్నాళ్లకుఁ దురుష్క
మారణ బద్ధకంకణుఁడైన రాజసింహు దివ్యమూర్తిని సంద
ర్శించితిని కాని నే నిపుడీతునితో నెట్లు ప్రసంగమునకుఁ
బ్రారంభింతు. వయస్సునఁ బెద్దవగుటచే నమస్కారమన రాదు.
ఇట్లనెదఁగాక (ప్రకాశముగ) మహమ్మదీయకుల విధ్వంసనో
పాయసిపుణా! జయము జయము. విమలాభిమాన పరిరక్షణా
సక్తా! జయము జయము.

రాజ- అయ్యా! ఈపీఠమున దయచేయుఁడు

ఇంది- (కూర్చుండి) ఇదిగో జాబు (అని యొక యుత్తరమిచ్చును).

రాజ- (చూచి హఠాత్తుగ లేచి) సోదరీ! ఇందిరా! నీవేనా! తమ్ముని
నమస్కారమందుకొనుము. (నమస్కరించుచున్నాఁడు).

ఇంది- నాయనా! జయమగుఁగాక. (తనలో) మహారాజాధిరాజై
యొక్క సామాన్యస్త్రీయందు సౌదర్యంబుఁ జాటించి యిట్లు
చరించు నీమహానుభావుని జయమాంగన తనంతఁ వలచిరాదా?

రాజ- సోదరీ! నీచరిత్రము విచిత్రము. నీవు ఢిల్లీపట్టణమునుండి యెటు
లఁ దప్పించుకొని రాఁగలిగితివి.

ఇంది- తమ్ముఁడా! దానికేమి. అది పదపడి విచారింపవచ్చును గాని
మీభావగారి వాక్యమనుసరించి సూపనగరు బ్రయాణమును
బ్రస్తుతము నీవు వారించినటులనె కదా!

రాజ- అది యెట్లు?

ఇంది- అయ్యో! తనకుమాలిన ధర్మము మొదలుచెడిన బేరము కలదా?

రాజ- అమ్మా? నాయుద్దేశము వినుము.

శా॥ నారాజ్యంబవ్వురంగజేబువశమైనన్ జివ్వయే తెంచినన్
తారానాథుఁడు సూర్యుఁడున్ గమనమాంద్యం బందినన్ గాని స
ద్వీరవ్రతము మెచ్చఁగా విమలసాధ్వీమానవిత్తంబు దు
ర్వారోదగ్ర పరాక్రమోన్నతిని సంరక్షించియే తీఱెదన్॥

మఱియు,

మ॥ పతివీవేయని నన్ దలంచుచు ననల్పప్రేమసూచించి, దు
ర్మతియామ్లేచ్ఛునిచేఁ బరాభవము సంప్రాప్తింపఁగాఁబోవు దు
స్స్థితియందుండిన రాజకన్యక నొకర్తెన్ విడఁగాఁబోను దు
ర్గతికిన్, నాబ్రతుకేటి కొక్క యబలన్ రక్షింపఁగా లేనిచోన్॥

ఇంతయేటికి. ఒక స్వకులకన్యను దుస్స్థితియందున్న దానిని దేశోపకారిణిని శరణాగతను నీవేయని నన్ను నమ్మికొని యున్న దానిని ఇట్టిహృదయనిర్భేద దైన్యవాక్యకలిత లేఖ లిఖించినదానిని (అని విమలజాబిందిరపైవైచి) మూతిపై మీసపువెంట్రుకలుగల వాఁడెవ్వఁడేని యొక్కొ-లమునకని యెట్టిస్థితియందేని ప్రాణాపాయావస్థ యందేని సంరక్షింపకుండ నుండునా! కాననే.

తే॥ గీ॥ ఇటుదివాకరుఁ డటు జనియించుఁ గాక
పట్టుఁబట్టి విమలను గాపాడు వాఁడ
అసన విధ యాచరింపకుండు నెడ భ్రూణ
హత్యకుఁగల పాపంబు నందువాఁడ॥

ఇంది- (తనలో) "రాజ" నిన రాజసింహుఁడే రాజు. (ప్రకాశముగ) నీశరణాగతత్రాణ బిరుదాంకము వర్ణనాతీతము కాని నీరాజ్య క్షేమముకూడఁ గొంత యాలోచింపుము.

రాజ- సోదరీ! సర్వమిదివఱకె యాలోచింపఁ బడినది. నేనొక్కఁడనే

కొలఁది సైన్యముతో రూపనగరమునకేగి మెల్లని కార్యము సాధించుకొనఁగలను. ఇచ్చట దుర్గాదాసుఁడు మొదలగుచమూపతులు రూపసింగు చెప్పినచొప్పున నడచుకొనఁ గలరు. ఇంతలో నేను రాలేకపోవుదునా? ఔరంగుఁడు యత్నములలో నున్నాఁడు కాని యింకను బయలు వెడలలేదుకద. ఇంతలో విమలను రక్షించి వేగంబునఁ దిరిగి రాఁగలను. అంతవఱకు మఱియేమియుఁ దొందరలుండవు. నేను లేనిలోపము కూడ నుండకూడదు. సేనికిఁ బ్రయాణమునకు సిద్ధముగ నుండనలయును. (పోఁబోవ)

ఇంది- మఱచితి. విమల చంద్రావతీపుత్రి శోకోపశమనార్థమై వ్రాసినయుత్తర మౌరంగునకుఁ జిక్కుటంబట్టి యాతఁడు విమలంగొంపోయి యుదయపురికి దాస్యముం జేయింతునని ప్రతినఁబట్టియుండెనని యూహించెద.

రాజ- (కోపముతో) ఉదయపురికి విమల దాస్యమొనరించునో? విమలకుదయపురి దాస్యమొనరించునో చూడఁగలవు.

కం॥ విమలకుదయపురిచే దా
స్యము నేఁ జేయింపనైతినా? మాతిది మీ
సము కా దిది చేతిది ఖ
డ్గము కాదిది రాచపుట్టుకయు కాదుసుమీ॥

సోదరీ! నన్నాశీర్వదించి పంపుము (అని నమస్కరించుచున్నాఁడు).

ఇంది- తమ్ముఁడా! సంశయింపఁ బనిలేదు. విమలా విజయాంగనా దృఢపరిష్వంగ బంధీకృతుఁడ వగుదువు కాని మఱియొక్కనికిఁ జిక్కవు. తమ్ముఁడా! పోయిరమ్ము శుభమగుఁగాక.

రాజ- సోదరీ! నేను దుర్గాదాసుఁడు మొదలుగాఁగల యోధుల కుచితకార్యముల నియోగించి రూపనగరున కేగెద. ఉదయపుర రాజ్యలక్ష్మి చంచలస్వభావ కాదు. వెఱవఁ బనిలేదు. నాము ఖోద్దేశ మాలకింపుము.

ఉ॥ సంతతి రాజ్యభోగ మదసంభృతచిత్తుఁడు బంధుమిత్రకా
లాంతుఁడు సాధ్వీమానహరణాకరశీలుఁడు లోభభావ భా
స్వంతుఁడు బాలహంతకుఁడు పాపుఁడు నా యపురంగజేబు గ
ర్వాంత మొనర్చువాఁడ జగమంతయు నైరికిఁ దోఁడు వచ్చినన్॥

సతీమతల్లీ! ఇఁక నాలసింప రాదు నాకు సెలవిమ్ము.

(నిష్క్రమించును)

ఇంది- ఓ వీర రసపుత్రాంగనలారా! రణకళా కోవిదలారా! పతివ్రతా మతల్లులారా! మనమందఱము శక్త్యనుసారముగఁ బురుషులకు సాయపడుట యుక్తము. రణమందు పడఁతులు పురుషులకు సాయపడుట యీభరతఖండమున నేఁడు పుట్టినదా? ఇది మనకుఁ బూర్వాచారము.

సీ॥ చల్లార్పదే దివ్యశరశరాసారంబు
చే నరుని పరాక్రమానలంబు
బూదెఁగావింపదే భూరిప్రతాపాగ్ని
నక్తంచరోగ్ర కాంతారసీమ
విదళింపదే శౌర్యవిలసనానిలంబున
నరకు దుర్గర్వ ఘనాఘనంబు
మాయింపదే మున్ను మత్తేభమట్టు బ
లియ విరోధ నాళీకవితతి

తే॥ గీ॥ ప్రమిల దుర్గ సత్య రాణిసంయుక్తయు
వారినెల్లఁ దలఁచి పనికిరాదు
పొలఁతులకసియు నెడి మూఢుల నిరసించి
దేశసేవఁ జేయుఁ డిపురుఁడింక॥

దేశాభిష్ట మిప్పటికిఁ గొంత తీఱినట్లు.

మ॥ నవరింపంగలఁ డింక సంఘపు దురాచారంబులన్ సర్వదు
ర్వ్యసనహారంబు లడంపఁగాఁగలఁడు తాయత్నించుచున్నాఁడు స

త్రివరత్వంబును వేగ నీకు నెలకొల్పఁగ రాజసింహుండు హైం
దవమాతా! మహనీయసద్గుణసమేతా! మాని నీకష్టముల్॥

సీ॥ మ్లేచ్ఛకులంబు భస్మీపటలంబుఁ గా
వింప జనించిన వీరమూర్తి
హరిహరబ్రహ్మాదు లని డీకొనిన వెన్నుఁ
జూపని విక్రమస్ఫూర్జితుండు
శరణార్థులనుదయాస్వాంతంబునఁ బ్రోచు
ప్రాజ్ఞతలోఁ బేరుపడినవాఁడు
స్వామిభక్తిసంరక్షణాశక్తి బాల్యమ్మునాది
పెట్టినపేరుగా వెలయుఘనుఁడు

తే॥ గీ॥ రాజసింహుఁ డటకి నిదే రానవచ్చె
జీవములు బుద్బుదంబులు స్థిరముకీర్తి
క్షత్రియములార! వీరసపుత్త్రులార!
మేలుకొనుఁడు యశఃకాంత నేలుకొనుఁడు॥

నేనును ముందు జరుగనున్న కార్యములఁగూర్చి జాగరూకతఁ బుచ్చికొనవలసి యున్నది. ఆలస్య మొనరింపరాదు. రాజసింహుఁడు రూపనగరాభిముఖముగాను ఔరంగుఁ డుదయపురాభిముఖముగాను బయనమైయుందురు. నాయత కార్యము నేను నిర్వర్తించుకొందును గాక. (నిష్క్రమించును)

పంచమాంకము సమాప్తి.



శ్రీమత్పరదేవతాయైనమః

—:o:—

# పాదుషాపరాభవము.

## షష్ఠాంకము.

విమ- ఏమమ్మా! పద్మా! యుద్ధవ్యవహార మెటులున్నది.

పద్మ- ఏలాగున నుండుట కేమున్నది. వైరిసేన యెక్కువ. మనసేన తక్కువ. వారు వెలినున్నవారు. మనము కోటలోని వారము మన యుద్ధపరికరములకంటె వాండ్రవె యుపయోగకరములు

విమ- అయ్యో! అట్లైన యిఁక రూపనగరము ప్రేతనగరమగునా?

పద్మ- జయాపజయంబులు దైవాధీనంబులు. ముంగానకు ముందే యశ్లీలము లాడెదవేల? మన రాజసింహుఁడు మనకుఁ దోఁడు రాఁడా?

విమ- ఆఁ. అట్లయిన నింతకాలమేల యాలసించును. అకారణముగ నుత్తరము వ్రాసి సరివారిలో నవ్వులకు లోనైతి. ఎఱుఁగమా రాజుల వ్యవహారములు. అకటా!

సీ॥ మృగయావిహారార్థ మీవు నేనును వన
భూములకానాఁడు పోవనేల
పోయినంతనె యేమి పో రాజసింహ భూ
పాలునకుఁ దోఁడుపడఁగ నేల
తోఁడైతిఁబో వాసిఁగోడనే విమలకే
పృథ్వి యంటంచు భావింపనేల
భావించెఁగాక యాపాటికే నన్నుఁ గా
మించెనటంచు భ్రమింపనేల?

తే॥ గీ॥ భ్రమ వహించితిఁ బో లజ్జఁబాసి నేను
గోల్పనై యాతని శరణుఁ గోరు టేల
తుద కతఁడు నన్ బరిభవాబ్ధిఁద్రోయ నేల
యన్నిటఁ జెడి నేనిప్పుడల్లాడ నేల॥

పద్మ- విమలా! విరక్తిఁ జెందకుము. రాజసింహుఁడు రాఁకున్న సామల్పండితుఁడేని రాఁకుండునా? సామల్పండితుఁడు వెళ్లుటే యాలస్యమైనదో లేక రాజసింహుఁడు సైన్యమునుకూర్చుకొను టేతడవయ్యెనో. ఈపాటికిరాజసింహుఁడు వచ్చుచు నేయుండవచ్చును.

విమ- నీమాటచలువవలన వచ్చిన మే లేకదా (చూచి) నాయనగారిటు వచ్చుచున్నారు. ఏలకో! (ఇరువు రటుమరలుదురు)

విజ- (ప్రవేశించి) అమ్మా! యిఁక జయాభిలాష వదలుకొనుఁడు. రూపనగరుకోట యీరేయి యేని మనయాధీనమం దుండునని తలంపను. లెక్కకు మించిన సైన్యమును గైకొని యౌరంగుఁ జేతెంచుచున్నాఁడు కాన

తే॥ గీ॥ మానమే మానపతులకుఁ బ్రాణమౌట
మొట్టమొదటనుండియు మానము చను వేళ
మరణమే రాజపతులకు శరణమగుట
నవసరంబల్లు నేఁడు మీరకనుసరింప॥

విమ- నాయనా! ఈమాట క్షత్రియాంగనకొకరు చెప్పవలసిన పనియే యుండదు. కాని మీరెవరినేని సహాయము కోరిన బాగుండును.

విజ- తల్లీ! సాటి రాచవారినెల్ల సహాయము కోరితి. ఒక్కఁడేని రాఁడయ్యె. పోనిమ్ము. ఇప్పుడీమాటకు నాదు లేదు. నాపునర్దర్శనము మీరు స్వర్గమున నగుఁగాక. మీకార్యమున కుపక్రమింపుఁడు. (నిష్క్రమించును)

విమ- పద్మా! వింటివా. ఒక రాజపుత్త్రుఁడేని యొకఁడు రాఁడయ్యెనఁట. చూచితివా చిత్రము. (కోపముతో)

మ॥ స్వకులస్త్రీని పరాభవంబుఁ బొనరింపన్ మ్లేచ్ఛభూమీశ్వరుం
డోకఁడేవ్వాఁడో తలంచుచున్న తఱిఁ గోఁడొక్కండు రాఁడంట, రా
చకొలంబందు జనింపరో! ప్రబల లజ్జాశూన్యులో! తాల్చినా
రోకొగాజుల్! నశియించిరో ధరణిలేనో కారొకో పూరుషుల్ ॥

ఓ క్షత్రియజాతిమాత్రోపజీవులారా! కులాభిమాన శూన్యులారా!

సీ॥ జాగీరులంద ముసల్మానులకుఁ గుమా
రైల పాణు లందీయఁగలరు కాని
పరమపావనమైన స్వకులంబు వర్జించి
మ్లేచ్ఛమతా మవలంబింత్రు కాని
మగపుట్టువుం బుట్టి కొలుగలాయి ప్రభులకుఁ
దలపన్ను లర్పింపఁగలరు కాని
ధనమునుగోరి యవననాయకుల యఘు
గులకు మురుఁగులొత్తఁగలరు కాని

తే॥ గీ॥ స్వమతకన్యయొక్కతె పరాభవదవాగ్ని
దగ్ధమౌ వేళఁ దోఁడురాఁ దలఁప రాదె
తలఁచు నెడ నుండీచచ్చెనే తగినశక్తి
రాజవంశీయులార! తరాజులార!

పద్మ- అమ్మా! దేశమున స్వవంశప్రేమ మానాభిమానములు పౌరు
షము సర్వము పూజ్యమైనవి. (నిరసనముగ) అయ్యో! తమ
కవమానము వచ్చునప్పుడు తలలెత్తని యీరాజమాత్రులు
పరోపకారార్థమై శ్రమ పడెదరా? వట్టియాశయె కాని యొక్క
రును మనకుఁ దోఁడురారు.

విమ- పద్మా! యథార్థముఁ జెప్పితివి ఈసత్యవాక్యములు సోమరు
లకు శ్రుతికటువులు కావచ్చును. సజ్జను లామోదింపక మానరు.

మ॥ పతిపీవేయని నిశ్చితాత్మనయి సంభావించితిన్ నాథ ను
ర్గతియుంమంటె శరణ్యమీవె ననుసంరక్షింపుమా! యంచుఁ జే

ర్చితిసందేశము రాజసింహునకు నర్గఁ జేపట్టకే పోయె నా
స్థితి యింకఁ దిలకించువార లెవ రిస్సీ నమ్మరా దెవ్వరిన్॥

పద్మ- అమ్మా! ఎవనివిషయమైన నైనను నీవటులఁ దలంపవచ్చును గాని రాజసింహుని విషయమై యటులఁ దలఁపఁ జనదు.

విమ- ఏమో! పద్మ కున్నంతనమ్మక మాయనుసియందు నాకు లేదు.

పద- నమ్మకము లేదా? నీకా? రాజసింహుని యందా? ఒక్క సారి మొగమెత్తి తిరిగి పలుకుము.

విమ- పద్మ! వచ్చెడివాఁడైన నింత తడయునా?

పద్మ- అయ్యో! ఉదయపుర మిక్కడనే కలదా! సామన్యులంశితుఁ డీతుగ కలను తప్పించుకొని పోవలయునుకదా! ఇంత సౌందర్యమైన యెట్లు.

విమ- సమయమునకు రాఁకపోయిన లాభమేమి.

పద్మ- అధైర్యపడకుము.

విమ- ఇంక నధైర్యపడ నలదని బోధించెద వేమి? అదిగో తురుష్కసైన్యము అంతిపురిద్వారమున కే వచ్చినది. ఈపవిత్రములగు రసపుత్రసతుల శరీరంబు లంతమందేని యవనులకుఁ జిక్కనీయ రాదు. నీవేగి యగ్నిఁ బ్రజ్వాలింపఁ జేయింపుము. జనకునాజ్ఞ చొప్పున జాతిసమాజమునకు వీరకార్య మొనరింతము పొమ్ము.

(పద్మ నిష్క్రమించును)

విమ- అక్కటా! మొతగో నాసంకల్పములన్నియు వికల్పములయ్యె.

సీ॥ ఆర్జింపనైతిఁగదా రాజసింహుని
పట్టంపుదేవినై బహుళ యశము
అందఁగానైతిఁగదా శౌర్యపురుషుని
చేఁబట్టి సౌభాగ్య జీవనంబు
ఆడఁగానైతిగదా యాఁడుబిడ్డనై
చంద్రావతిని సరసవచనముల

అలరింపనైతిఁగదా భర్తృశోఁగూడి
మహనీయభారతమాత నెలమి

గీ॥ ఒకటినే దలఁపఁగ దైవ మొకటిశలఁచెఁ
గోర్కులన్నియుఁ గొంతెమ కోర్కులయ్యె
కడకు నా బ్రతుకు సిరర్థకంబెయగుటఁ
దనువుఁ దొరఁగుటె నాకుఁ గర్తవ్యమిపుడు॥

నాథా! రాజసింహా! నీకేయేకారణములవలన రాఁదడవయ్యె
నో యూహింపలేక యిదివఱకుఁ దూలనాడితి క్షమింపుము.

సీ॥ రాజసింహా! పునర్జన్మాననేని నీ
పడఁతుకనాదు నిప్పటికి సెలవు
భరతమాతా! నీశుభంబుల వీక్షింప
కే పోయెదను క్షమియింపుమమ్మ
మోహమా! నీశోకజోహారు నాచెంతఁ
గార్యంబు లేదింకఁ గదలి చనుము
శృంగారమా! యెవ్వరికొఱకే నీయుని
వనచంద్రికా విభవంబు పొమ్ము

గీ॥ మానభంగంబు కాకుండ మానవతుల
కాఁచి పవనమ! నీలోన డాఁచికొమ్ము
న్యాయ మన్యాయముఁ జూచి యఘుదురాగ
తులను దైవమ దండింపఁగలవు కాక॥

పద్మ- (ప్రవేశించి) అగ్ని ప్రజ్వలింపఁ జేసితి. ఇఁక మనము త్వర పడవలయును. ఔరంగుని సైన్యమప్పుడే యంతఃపురముఁ బ్రవేశింపుచున్నదఁట.

విమ- అట్లయిన వేగిరింపవలయును. అవశిష్టమేమి. సర్వము సిద్ధమే. ఇట్లగుం గాక. ఓపతివ్రతామతల్లులారా! సత్క్షత్రియ వంశ భూషణప్రాయలారా! రూపనగర రాజకాంతలారా!

ఉ॥ మానమె ప్రాణమౌట మనమానినులందఱకుం దురుష్కసే
నానివహంబు డాయుట, జయంబరికే స్థిర మౌట, క్రూరఘో
రానలకీలలందుమికి, హాయిగ స్వర్గసుఖంబు లందరం
డీ; వనభోగులార! యశమే, ఁదిరమౌటను కొంకఁ బోకుఁడీ॥

క॥ మానము సర్వస్వంబే
మానినికైనను వలదనుమానమసి మున
ల్మానులె జయింతు రైనన్
మానదు మానను మనకిప మానసము లెండీ॥

పద్మ- విమలా! చూచుచుచూచుము. పేరంటమున కేతెంచి నటు లఁపరిమి తౌదరముతో నీమాటకు జోహారుఁ గావించి క్షత్రియాంగనలు పరుగుపరుగున నెల్లు పోవుచున్నారో చూడుము.

విమ- పద్మా! నామరణమునుంగూర్చి నేను జింతింపను గాని యింతమంది రసపుత్రాంగన లగ్నికాహుతి యగుటఁజూచి యోరువలేకున్నాను. ఈదింతాకరంబగు నీకార్యంబు చూడఁ జాలను. మున్ముందు నేనె దగ్ధమయ్యెద.

పద్మ- (విమలనాపి) విమలా! వేగిరింపకుము. పదుగుఱితోఁ బొందు చావు పెండ్లివంటిదఁట. రవ్వంత తాళుము.

విమ- పద్మా! నన్నాఁపకుము. పుణ్యాంగన లందఱు రానెవచ్చిరి.

(మఱికొందఱు రసపుత్రస్త్రీలే తెంతురు. అందఱగ్ని ముందునిల్చెదరు.)

అందఱు- అమ్మా! ఆలసింప నేటికి.

పద్మ- అదిగో! ఆధ్వని వినుఁడు. ఆపాదముల చప్పు డాలకింపుఁడు. తురక లంతఃపురముఁ జొచ్చి స్త్రీలకొఱకు వెదకు చున్నటులున్నది. త్వరపడుఁడు. త్వరపడుఁడు.

విమ- ఓ దశమాతా! నీయూడిగమున కీదినమె యంత్యదినము.

సీ॥ కనులార వీక్షించుకొనుఁడమ్మ మీ రెల్లఁ
జెలులార మనకిదె చివరిచూపు

మనసార నాశ్లేష మొనరింపవె వధూని
కా మనకిదె తుది కౌఁగిలింత
చని వేఱుచోటికి సజ్జనులం గొల్వ
న్యాయంబు దాసీజనంబులార
ఘనవీరవర్యులఁ గన్న రూపపురంబ
సెలవిమ్ము నానమస్కృతులఁ గొనుము

తే॥ గీ॥ దైవమా నేనుచేయు ప్రార్థనము వినుమి
యెన్నిజన్మంబు లెత్తింతువో నన్ను నన్ని
జన్మములకు నాకుఁ బతిగ నలుపుమయ్యా
రాజలోకబిడౌజు శ్రీ రాజసింహు॥

(అందఱు సిద్ధముగ నుంటిరా) (తెఱలో)
అగ్ని చల్లార్పుఁడు. అగ్ని చల్లార్పుఁడు. రాజపుత్త్రిలకే జయము.

తోటకవృత్తము.

తగదీ తెగుమానము దాఱులఁ గూ
ల్పఁగఁ గల్గితి నీయభిలాషయు దీ
ర్చఁగ జాలితిఁ బల్కను బల్కిన రీ
తిగ నవ్వరియింపఁగదే విమలా॥

విమ- (తనలో) అక్కటా చచ్చితిని చచ్చితిని. తురకతేఁడు రూప
నగరముధ్వంస మొనర్చి నన్నుంగొనిపోవ వచ్చునట్టులున్నది.

రాజ- (ప్రవేశించుచు) వీరకాంతలారా! శాంతింపుఁడు. శాంతింపుఁడు.

తే॥ గీ॥ ఖలతురుష్క మార్గణ బద్ధకంకణుండు
రాజసింహుండు కలుగంగఁ బ్రాణిశోడ
మానభంగ భయోద్రేక మానసమున
నువిదలారా! మహాగ్నియం దూఱుకఁ దగదు॥

రాజపుత్త్రకాంతలు-ఇప్పటికి రాజసింహునివలన జీవించితిమి. మేమిఁక
నిర్భయముగ నెలవున కేగవచ్చును (రజపుత్త్రస్త్రీలు నిష్క్ర
మింతురు).

పద్మ- అయ్యా! ఇందుమా వేగిరపాటు రవ్వంతయు లేదు. ఔరంగుఁడు లెక్కకుమించిన సైన్యముతో మాపైకి నచ్చుచున్నాఁడని తగిన వారివలన విని రాజమర్యాద ననుసరించితిమి.

రాజ- ఔనఁట. పెద్దపొరపాటె. నిశాసమయమగుటచే నా సైన్యముం గాంచి యిదివఱకె ఔరంగుని సైన్యము రాఁగల దనుకొనుచుం డుటం జేసి తురకసేనగ భావించి మీకటులఁ దెలియఁ జేసితి మనియు నన్ను వేవేగఁ జని మిమ్మా యగ్నిప్రవేశమునుండి తప్పింపుమనియు విజయసింహనామముగా రాజ్ఞనిచ్చిరి. ఎన్నఁడు మీయంతిపురి మార్గమెఱుఁగని వాఁడనగుటచే నారాకకించుక తడవయ్యె. ఈయగ్ని చాలసేపటిచుండి మండుచుండెనని విని స్త్రీజన మేమయ్యెనో యనుకొంటిఁగాని నాపురాకృతమునకు దైవము తోడ్పడి చూపింపఁదగిన ఫలముం జూపి నన్నుఁ గృతార్థు నొనర్చె. పద్మా! మీచెలి పెండ్లికై సిద్ధముగఁ బసుపువస్త్రం బుల ధరించియున్నది. ఇఁక నాఁడె యాలస్యమా?

పద్మ- (నవ్వుచు) అయ్యా! మీరించుకసేపు రాకుండిన యెడల మాయందఱి పెండ్లియు నిదివఱకే యయ్యెడిది. దేవా! అగ్నిప్రవేశముఁ గావింపఁ బోవుసమయమునఁ బసుపువస్త్రములఁ దాల్చుట మనకలవాటు కదా

రాజ- సరియె కాని నేనిచ్చట మీరచ్చట నిలువఁబడిన నేమిఫలము కర్తవ్యము నాలోచింపుఁడు.

పద్మ- మాయాలోచన యేమున్నది. అదిపురుషుల పనియే.

రాజ- విమలా! నన్నుఁ గాంచి యేల మఱుఁగున కేగెదవు.

క॥ అరివర్గంబుఁ దునిమి నా
కర మందమని లిఖింపఁగాఁ గోరిన మా
దిరి వైరుల నెట్టితి నా
చరణీయుంబిపుడు మీఁదిసంగతి సుమ్మా॥

(అని డాయం జనుచున్నాఁడు.)

విమ- (పద్మచారుణినకుఁబోయి) నేనిచ్చట నుండఁజాలనే రమ్ము పోద
ము. నాకు సిగ్గగుచున్నది.

రాజ- అబ్బో! సమయమునకు సిగ్గుండఁ దగినదే.

సీ॥ మేములేమని యెంచి యేమేమొ పద్మంగో
నడవిలో నర్మోక్తు లాడువేళ
మఱచిపోఁకుఁ డెదను గుసుమహితచరిత
యంచును నను హెచ్చరించువేళ
భృత్యురాలు సెలవు వేఁడికోవచ్చునా
యని నిన్ను నాకిచ్చినట్టివేళ
పట్టి వైరులనెట్టి చెట్టఁబట్టు మటంచు
నతి గుప్త సందేశమంపువేళ
తే॥ గీ॥ కాంతుఁడవు నీవె యంచుఁ ద్రికరణశుద్ధి
నెడఁద నమ్మితి నన లిఖయించువేళ
కననిసిగ్గు నిన్ని పుఁడు పైకొనెనిదేమి
అంతవింతలే యింతలో నలరుఁబోఁడి॥

విమ- (మోముత్రిప్పి) గురుజనానుమతికై ముందు యత్నింపరాదా!

రాజ- అదిగో! మామగారిటువచ్చుచున్నారు.

(విజయసింహుఁడు ప్రవేశించును)

విజ- (తనలో) రాజసింహుని సత్కృప నావంశమును రక్షించినది. వి
మలను రాజసింహుఁడు, రాజసింహుని విమల వరించికొనిరని
యొకానొకతఱి విమలయుంగుళీయకమును బట్టి గ్రహించితిని.
నేఁటి రాజసింహాగతమున కీవిమలాప్రణయబీజమె హేతువు.
అదియుఁగాక యిరుపురీణుజోడువారు. కాన వీరినిప్పుడె సతి
పతులుగి నొనర్తును. (రాజసింహుని సమీపించును)

రాజ- (విజయసింహునితో) అయ్యా! రాజసింహుఁడు నమస్కరించు
చున్నాఁడు.

విజ- దీర్ఘాయు రారోగ్యప్రాప్తిరస్తు.

విమ- తండ్రీ! పాదముల కెఱగుచున్నాను.
విజ- దీర్ఘసుమంగలీభవ. అమ్మా! విమలా!
సీ॥ ఎవ్వానికి సహాయమేగినో వని మెచ్చ
తపస్సాధనముల మదంబడఁగ
నెవ్వాని భర్తగ నీవేయటంచును మనో
వాక్కాయకర్మల నలచినావో
యెవ్వాని రప్పించి తీనాఁడు "రక్షింపు
మీ"యన్ననుచు లిఖియించె లేఖ
నెవ్వాని విమలసత్కృపను నీవగుపడ
నేర్పితి మరల నానేత్రములకు
గీ॥ నట్టిరాజసింహునిఁ గాంచి నీవన్యయట్లు
తొలఁగి తొలఁగి చనఁగ నేల దూరమునకుఁ
బెండ్లికాలేద నేడి కొంకు విడువుమమ్మ
రమ్మయియ్యదే వివాహమ్మొనరుతు॥
(విమలహస్తముతోఁ రాజసింహుని హస్తముంగలిపి)
నూత్నదంపతులారా? మీరానుదినాభ్యుదయానోన్యాన్యానురాగులై వర్ధిల్లుదురు గాక.

(నేపథ్యమున)

విజయసింహమహారాజు పల్కు లమోఘుంబు లగుఁగాక.

విజ- (సంతోషముతో)మీయిరువురి యభిలాషలందీఱిచి ధన్యుండనైతిఁ. రాజసింహా నీయట్టిసర్వజ్ఞులకు నేనేమియుఁ జెప్పువాఁడను కాను, గానితల్లిలేని యీబిడ్డను సర్వవిధముల రక్షించుకొను భారము నీయది. విమలా! సర్వశాస్త్ర పరిశీలనముఁ నీకైనబోధలనవసరము. అయినను గన్నకడుపుకాన నొక్కపలుకుఁబలుక బుద్ధియగుచున్నది. మీరట్లు ప్రవర్తింతురు గాక.

సీ॥ పరివారలెల్ల మెచ్చంగ నిత్యంబు న
న్యోన్యము మీరలరారవలయుఁ

గార్యక్రమములనొకరికొకరు కుడిభు
జంబులై కీర్తిఁ గాంచంగవలయుఁ
గష్టమాగాక సుఖంబగుఁ గాక సం
ప్రీతి నిర్వ్యూరమనుభవింపవలయుఁ
గలనైన నాటపాటలనైన నొక్క రి
కొకరెగ్గు భావింపకుండవలయు

తే॥ గీ॥ నన్నిఁటికినేమి మీహృదయంబులం ద
నల్పమాతృదేశప్రేమ నిల్పవలయు
మగువమగనికై, మగువకై మగఁడు తుద క
వసరమైన నుసురులేని యొసఁగవలయు॥

రాజ- (తనలో) ఆహా, యీవిజయసింహుని వాక్యము లంగీకార యోగ్యములెకదా! అర్థాంగులను దమబానిసలనుకొని హీనముగఁ జూచు మూర్ఖజనావృతమైన యీభారతభూమి నిట్టి స్త్రీస్వాతంత్ర్య మభిలషించు వారుండుట దేశవృద్ధి దాయకము (ప్రకాశముగ) మామగారు! మీయాన నుత్తమాంగమున ధరించితి.

విమ- భవదీయామూల్య నీతివాక్య రత్నములఁ దలధరించుచున్నదాన ను తండ్రీ.

విజ- రాజసింహా! నిన్నొకటి విమయ మడుగ మఱచితిని. విరోధి సేనలోఁ జొరబడి నీకు దోఁడుపడి యమునివలె నరాతి పదాతి శిరోధులఁ జెండాడిన మహానుభావుసింకొకనిఁ గాంచితిని. అతఁడెవ్వఁడు.

రాజ- (తనలో) ఈయన యడుగునది శివసింగును గూర్చి కాఁబోలు, పాపము కొమారుఁడని యెఱుంగఁడు తండ్రికొడుకల కనురాగముఁ గన్పింపవలసిన సమయమిదియె (ప్రకాశముగ) అతఁడొక రాజకుమారుఁడు. మీయనుగ్రహార్థియై యీయుద్ధమునకు సహాయమువచ్చెను.

విజ- నాశక్త్యనుసారముగ నాతెని సత్కరింప వలసియున్నది. అయ

నను బిలిపింతమా ! అచ్చటకుఁ బోవుదమా !

విమ- (నవ్వుచు) పద్మ నిచ్చి యీ యాయనకుఁ బెండ్లికావింపరాదా !

పద్మ- (సిగ్గుతో) విమలా నీకుఁ బెండ్లిపిచ్చి పట్టినటులున్నది.

విమ- రాజసింహా ! ఆవీరమూర్తి యవివాహితుఁడని గ్రహించితిని. పద్మనాతనికొసంగి నారాజ్యమునఁ గొంత నాయనఘునకొసంగ సిద్ధముగ నుంటిఁగాని నాపుత్త్రుఁడగు శివసింగు నాయము కామించినది.

రాజ- (సంతోషముతో) ఆయనఘుఁడే శివసింగు.

విమ- మాయన్నగారు దయచేసిరా ! ఏమి నాయదృష్టము.

పద్మ- (తనలో) నేనెవనిఁ గామించియుంటినో యీయనఘుఁ బెండ్లాడు నదృష్టము నేఁటికిఁ బట్టినది. నేను సర్వవిధములఁ గృతార్థురాలను. ఇఁక నచిరకాలమున శివసింగుని యవలోకనము లభింపఁ గలదు.

విజ- (సంతోషాతిశయుఁడై) అక్కటా ! ఎన్నిదినములకు నాపుత్త్రు దర్శింపఁ గలిగితిని. తనయా! ఆత్తనయా ?

మ॥ పరిపంథీశనియుక్త దుస్తరచమూ భాగంబుఁ జెండాడి, సో
దరిసంకల్పముఁ బూర్తిచేసితివి మద్గర్భంబునన్ బుట్టిన
ట్టి ఋణంబునన్ విడిపించుకొంటి వరికోటీరస్థ రత్నాంశు సం
భరితప్రోజ్జ్వల పాదపీఠ శివసింహా ! వీరచూడామణీ!॥

రాజసింహా,మనము పద్మాకళ్యాణముఁ గూడ సలుపవలయును. శివసింహుఁ డెక్కడనుండెనో యచ్చటకుఁ బోవుదము రండు.

రాజ- (పోఁబోయి) మామగారు, ఇప్పటికిఁ గావలసిన పనులన్నియు దైవయత్నమున నెఱవేరినవి. కొలఁదికాలములో ముగించి నేను విమలతో నుదయపురికేగెద. పెద్దపాదుషాతో వైరముంబెట్టికొని విమలనిచట నిలారుంచికొనుట శ్రేయోదాయకము కాదు.ఉదయపురికోట శత్రుజన దుర్భేద్యము ఏమియాజ్ఞ.

విజ- నాయనా! నిరభ్యంతరముగ నీయిచ్ఛవచ్చినటు లొనర్ప వచ్చును. ఉదయపురి కోట విషయము నేనెఱుఁగనివాఁడను కాను. నాకొమారుని కళ్యాణముం జూచి రెండుదినము లుండివెళ్లుము.

రాజ- త్వరలో పద్మాశివసింగుల కళ్యాణము ముగించి విమలా సహితముగ నే నుదయపురికిఁ బోవలసియున్నది. పాదుషాహా నాపురముపైకి సైన్యముతో దండెత్తి వచ్చుచున్నాఁడఁట సెలవిండు.

విజ- అట్లయైనఁ బుత్రునితోడను సైన్యముతోడను నీకు సహాయ మువత్తుము

పద్మ- మామగారు! రూపవగ రమెవ్వరికొప్పగింతురు. తాము లేని విషయము గ్రహించి వైరులు పురముఁజొచ్చినఁ బ్రతిఘటిం చుట కష్టము.

విమ- వదినా? అప్పుడె నీస్థానము నీవు కాపాడుకొనునంతటి స్వతం త్రము వచ్చినదిగా! ఏమి మాయన్నగారిపైఁగల ప్రేమ.

విజ- రాజసింహా? అట్లయిన మనమాలసింపరాదు. త్వరగ నంతఃపు రమునకుఁ బోవుదము రండు శివసింగు నచ్చటకుఁబిలిపింతము-

విమ- పద్మా! ముందునకు నడువుము. సిగ్గుపడెదవేల!

పద్మ- (సిగ్గుతో) నీకునముముగ నే వచ్చుచుంటిని.

(నిష్క్రమింతురు)

షష్ఠాంకము-సమాప్తి.





శ్రీమత్పరదేవతాయైనమః

# పాదుషాపరాభవము

## సప్తమాంకము.

[ఆరావళీ పర్వతదరీద్వారమున ఖడ్గపాణియై
రాజసింహుఁడు నిలచి యుండును.]

రాజ- రూపసింగు కాఁబోలును. హాసనల్లీఖాను వేషమును విడచి నిజవేషముతో నిటు లేతెంచుచున్నాఁడు.

(రూపసింగు ప్రవేశించును.)

రూప- దేవా? నమస్కారములు.

రాజ- మిత్రమా? నీకు సర్వదా జయమగుఁగాక. నీవు తురకవేసమున నౌరంగునిఁ గొలువకున్న నింత సులభముగ నాతని సేనాసహితముగ బంధింపఁజాలముసుమా! నిన్నుఁ బ్రత్యేకించి కొనియాడనేల ముఖ్యముగ నివంశమొకదా! భారతభూమి కింత యౌన్నత్యముఁ గల్పించుట కాధారమైనది చూఁడుము.

ఉ॥ జీవములందు నాసలఁ ద్యజించియు నీసతి నీదుబావ దు
ర్భావులఁ బాదుషా నయనపాలుగ యాటల సాగనీక చం
ద్రావతి మాన మానమెసుతు ప్రాణముఁగాచిరి నేఁడు లోయయం
దీవపురంగుఁ జేరిచితి వేమని కీర్తనఁ జేయుదుర్ నినుఁ॥

నిశ్చయమునను భరతమాతపుత్త్రుఁడవని సంతోషింపవలసినది నిన్నే.

రూప- రాజసింహా! ఇందు నాప్రయోజకత్వం బేమియులేదు. మీవంటివారికి స్వదేశప్రేమ లేకున్న నాబోటివాఁడు దేశోద్ధారణార్థము పాటుపడిన నెంతయో పడకుండిన నంతియు. ఇటు చిత్తగింపుఁడు.

సీ॥ నయనపాలుని డాఁకి జయమొందఁగా నివ్వు
సేనాసహాయంబు సేయకున్నఁ
బాదుషా నిచ్చట బంధింపఁగా సైన్య
యుతుఁడవై యిటఁ బొంచి యుండకున్న
విజయసింహాత్మజ విమలమానంబు ర
క్షింప నీవే దయ చేయకున్న
క్షణమైన నీవు హృత్ సారసంబునయందు
మాతృదేశప్రేమ మఱచియున్న

తే॥ గీ॥ నిందిరా దుర్గదాసుల మెక్కువయును
రూపసింగు తెలివి తేట రూపనగరు
పతి సుత స్థితి దేశంపుగతియు నాఁడె
విదితమైయుండు నూరును బేరులేక॥

రాజ- చూచితివా కత్తిపోటుకంటె కలముపోటె యెక్కువయనినట్లు బాహుబలముకంటె బుద్ధిబలమె ముఖ్యమైనది. బుద్ధిబలమె లేకున్న నౌరంగుఁడు మనకుఁ జిక్కుట దుర్లభమ్మని తలంచుచున్నాఁడ.

రూప- సిద్ధసంకల్పుఁడవగు నీవు తలపెట్టినకార్యము గట్టెక్క కుండునా?

రాజ- ఇంత బుద్ధిహీనునిఁజేసి యౌరంగునిసైన్య మీలోయలో నెట్టులఁ బ్రవేశపెట్టఁ గలిగితివి.

రూప- దేవా! ఔరంగునకు నాపై నెక్కుడు నమ్మకము. తత్కారణమున నుదయపురికోట కీలోయనుండియేగిన వేగిరము చేరఁగలమనియు హఠాత్తుగకోటపైఁ బడిన రాజసింహుని గెలువ వచ్చుననియుఁ బోరఁబెట్టి నేను ముందుదారితీయఁ బ్రారంభించి

తిని. ఇంతలో నాయానకభిలషించి కొందఱు రసపుత్త్రసైనికులు సైన్యమునంతయు లోయలోనికి రానిచ్చి యంతః పురస్త్రీలు లోయలోనికి రాఁబోవుసమయమున లోయద్వారము మూసిరి. వెంటనే సేనలో పెద్దకలకలము జనించెను. అప్పుడు నే నౌరంగునితో నాకలకలము నడఁచెదనని బొంకి సైన్యముం ద్రోసికొనివచ్చి బైటఁ బడితిని. ఇప్పుడీతురుష్కసేన యెటు పోవుటకు వీలు లేదు. ఈలోయయందు గతింపవలసినదే. రాజసింహా! అంతఃపురస్త్రీల గతియేమైనది.

రాజ- ఈప్రాంతిమందలి యొకగుడారమందుంచి నాప్రతిజ్ఞ నిర్వహించుటకై విమలకు దాస్యముంజేయ నుదయపురి కాజ్ఞయొసంగితి.

రూప- ఇప్పటికి నీప్రతిజ్ఞకూడ నెఱవేరినట్లె. ఏదియో యోజించుచున్నారే!

రాజ- ఈమ్లేచ్ఛుల యవస్థచూడ నాకుఁ గష్టముగ నున్నది. కొండలపైనుండి మనవాండ్రు దొర్లించు ఱాళ్ల చేతను ద్వారమందుండి మనవాండ్రు ప్రయోగించుబాణ సమూహముచేతను నొచ్చి తురుష్కులు కంఠగతప్రాణులై యున్నారు. ఒక్కసారి మనపై పడుదుమనుకొనిన తడవ కైదుగురకంటె యెక్కుడుమందియీద్వారమున రాఁజాలరు. కర్తవ్యమెద్ది! వీండ్ర నేమిచేయుదము.

రూప- రాజసింహా! నీకు నేను ప్రత్యుత్తరముఁ జెప్పఁగలనా? మీయిష్టప్రకారము చేయుఁడు.

రాజ- అట్లయిన నాస్వాతంత్ర్యమునకు క్షమింపుము. ఓక్షత్రియసేనాజనులారా! యుద్ధము మానుఁడు. యుద్ధము మానుఁడు. ఓ మొగలాయి వీరభటులారా! మీకుఁ బ్రాణములపై యాన కలదేని మీపాదుషాగారితో నామాటలుగ నిటుల వచింపుఁడు.

ఉ॥ ఏల జయాభిలాష యిటులెంత పెనంగినఁగాని గెల్వఁగాఁ
జాలవు లోయనాఁదగిన శత్రులబోనునఁ జిక్కినట్టి శా
ర్దూలమవైతి వింతటవిరుద్ధపుసేఁతలఁ జేయునంచు నా
ప్రోల వచించినన్ విడతుఁబో నినుఁ బ్రాణముతోడ మ్లేచ్ఛుఁడా॥
ఉ॥ ఊరక లోయలో మరణమొందక యోడితినంచు నాకుజో
హారులొనర్చి మాన్పి జిజియా "నిఁకహిందుమతంబు జోలికిన్
బేరికిఁ గూడ రా"ననినఁ బెండ్లము బిడ్డలనిచ్చి పూర్వపు
గౌరవమిచ్చి పంపుదును నమ్ముము ప్రాణముతోడఁ దక్కెడిన్॥
మఱియు నిట్లని పాదుషాకుఁ దెలియఁ బఱచుఁడు.
సీ॥ కదలమెదలలేని కన్నతండ్రిని బట్టి
చెఱసాలనుంచు దుశ్చేష్ట కాదు
సారాయిమత్తుచే మూరాదు పడియుండఁ
బిలుకుమార్చిన దుష్టవృత్తి కాదు
యశవంతుసుతు హాలాహలమున నిర్జించి
నట్టి నమ్మకపు ద్రోహంబు కాదు
భార్య చెంగటఁ బ్రగల్భములాడి కార్యానఁ
బప్పులో గాల్వేయు పసయుఁ గాదు
తే॥ గీ॥ ఈతురుష్కకురంగమృగేంద్రుఁడైన
రాజసింహునితోడ వైరంబనంగ
వట్టిబిగుమానముల వీడి ప్రస్తుతంపు
గతియెఱింగి పొత్తొనగూర్చి బ్రతుకు మోరి॥
తే॥ గీ॥ ఈనిబంధనముల కొప్పవేని వినుము
మాడి చత్తువు నీరునుగూడు లేక
పైన సామ్రాజ్యలక్ష్మితోఁబాటు కావ
లయును బతిహీన యర్ధాంగిలక్ష్మి కూడ॥
రూప- అయ్యయ్యో! చేతఁ జిక్కిన బలవద్విరోధులపైని మీకింత కనికరమా.

రాజ- బలవద్విరోధినైనను శక్తియున్న ముఖాముఖిఁ బోరి సంహరింపవలయుఁ గాక నీలాటి చాటు పోటుదనము మనబోటులకుఁ బాడియా? ఇట్టిరాజును లోయలోఁ బెట్టి చెట్టతనమున మట్టుపెట్టుట యెట్టిదిట్టతనము.

రూప- అయినను మనమనుటయే కాని వాఁడీసంధి కొప్పుకొనఁడు, చావనైనఁ జచ్చుఁగాని యౌరంగుఁడు శత్రులకు జోహారనఁడు.

రాజ- చూచెదను. (తెఱలో.)

ఘోరము. ఘోరము.

రాజ- ఎవ్వఁడా దీనుఁడు.

రూప- ఎవఁడో రసపుత్రసైనికుఁడే.

(రాజపుత్రసైనికుఁడు ప్రవేశించును)

సైని- (రాజసింహునితో) ప్రభూ! నమస్కారములు.

రాజ- సంగతియేమి.

సైని- దేవా! ఏమియు లేదు. తామాపిన సంధి నియమము లెవ్వఁడో తురుష్కసేనాపతి పాదుషాకెఱింగింపఁగా వానిపైఁ గోపించి తురకరాజునకు రసపుత్రునకుఁ బొత్తా. ఛీ. యిట్టిసంధినియమములఁ దెచ్చిన నిన్ను "నా కరవాలము క్షమింప" దని వాని తలఁ ద్రెళ్లవేసెనని తురకసైనికులు చెప్పికొనుచు యుద్ధము సలిపి వీరస్వర్గమందుటే మేలని మనసేనపైఁ బడనేతెంచి వృథాగ గతించుచున్నారు. ఏలికకు విన్నవింప వచ్చితిని.

రాజ- (రౌద్రమూర్తియై) ఈచండాలు నేమిచేసిన నేమి పాపము? సైనికా! నీవేగి సైనికులందఱకు నామాటగ నిటుల వచింపుము.

ఉ॥ వచ్చినపోరు వచ్చెను గృపారహితాత్ములతోడ నేఁడుమీ
యిచ్చకువచ్చినట్లు చరియింపుఁడు, సంధినిమిత్త మంత పై
వచ్చునె! మానునో! యెఱుఁగవచ్చునుసుం, డవురంగజేబు నా
మచ్చరమెంతసేపొ యభిమానమదెంతటిసేపొ చూచెదన్॥

సైని- చిత్తము. అట్లె యొనర్చెదను. (నిష్క్రమించును)

రూప- క్షత్రియులపైఁ గల కోపాతిరేకంబునను "జిక్కితిఁ గదా" యను జీకాకు చేతను సందేశముఁ దెచ్చిన స్వసేనాపతినట్లు తునిమెఁగాని మన నియమముల కొప్పుకొనక యూరంగుఁడు చేసెడి దేమి?

రాజ- సంధికొప్పవలె లేకున్నఁ బ్రాణంబు లివ్వ డొప్పఁ జెప్పవలె.

(తెఱలో)

దేవా! పాదుషాగారు సంధికొప్పి సంధినియమముల వినఁగోరుచున్నారు.

రాజ- రూపసింగూ! అట్లయిన యుద్ధముఁ జాలింపఁజేసి మారాయ భారివై సంధి కుదిర్చికొని రాఁగలవా?

రూప- రాఁగలవా యన నేల! "రమ్ము" అనరాదా?

రాజ- అట్లె యంటినను కొమ్ము.

రూప- సంధి నియమము లెవ్వియో?

రాజ- వినెదవు కాక.

సీ॥ హిందూమతద్వేష మింతటినుండి నె
　　　　మ్మనమున మొదలంట మఱువవలయు
క్షత్రియులకుఁ దాను జాలనటంచు హ
　　　　స్తములు మోడ్చి జోహారు సలుపవలయుఁ
దలపన్నులాదిగాఁ గలపన్ను లన్ని యీ
　　　　దినమునఁ దొలఁగించి తీఱవలయు
మా ప్రోలి మేరల దోఁపిడిగుంపుల
　　　　జాడలు లేకుండఁ జూడవలయు
　తే॥ గీ॥ రాజపుత్త్రులకెల్లఁ దురకలతోడ
　　　　సమముగా మరియాద నొసంగవలయుఁ
　　　　గారకుండె తానగుట నిక యమునకు
　　　　మనవ్యయము నాతఁడే భరింపఁగవలయు॥

రూప- చిత్తము. (నిష్క్రమించును.)

రాజ- ఆహా! నేటికి నాకోర్కులన్నియు సంపూర్తిగఁ దీఱినవి. (చూచి) ఎవరా పరుగుపరుగున వచ్చుచున్నది. (నిదానించి) ఓహో పండితులవారే! (సామల్పండితుఁడు ప్రవేశించును.)

సామ- (సంతోషముతో)

తే॥ గీ॥ చెలఁగి విమలమానంబు రక్షించినాఁడ
వహితులంగెల్చితివి యుదయపురిచే వి
మలకు దాస్యంబుఁ జేయింపఁ గలిగితీవు
ప్రతిభటానీక గజసింహ రాజసింహ॥

రాజ- పండితవరా! ఏమంటిరి. విమల కుదయపురి దాస్యమొనర్చెనా?

సామ- ఇందాశ్చర్యమేమున్నది. అదికాక దానితలలోని జేజమ్మ కూడ చేయదా ?

రాజ- ఆసంగతి స్పష్టీకరింతురుగాక.

సామ- మనయిందిర పూర్వపరిచయురాలు కనుక చనువుగా వెళ్లి యుదయపురితో విమలాదేవిగారికిఁ దమలపాకులఁ జుట్టియీయ వేమే యని యడిగెనఁట.

రాజ- ఇంతమాత్రముననే యుదయపురి విమలకాకులు మడచి పంపెనా?

సామ- అబ్బో! పాదుషాగారి బేగముకనుక కొంతవఱకు బెట్టుచేసి నౌకరిచేయనిది తనకు వియుక్తిలేదని యెఱింగి యాకులమడచి యందించి విమలాదేవి పడకటియి ల్లలంకరించెను.

రాజ- పాపముభర్తగారు సంపాదించినదానికంటె భార్యయేయెక్కుడు సంపాదించినది.

సామ- ఏమిటి.

రాజ- పరాభవసంపద.

సామ- అయ్యా! ఒకవిమనవి. ఆగ్రహింపకున్న విన్నవింతును.

రాజ- మంచిచెప్పుడును గోపపడను.

సామ- నాబుద్ధికి మంచిదని తోఁచుటఁజేసి రాణావారితో మనవిఁజేయ సాహసించుచున్న వాఁడను.

రాజ- అట్లైన నుడువ వచ్చును. మంచిగ్రహించి చెడ్డ విసర్జించె దను. ఒకవేళ తప్పైన దిద్దుటకూడ సంభవించును.

సామ- అట్లైనఁ జెవియొద్దకు రానిత్తురానన్ను.

రాజ- రహస్యమా.

సామ- అనుకొనినాఁడను.

రాజ- ఇచట మన మిర్వురమెకదా యుంటిమి. ఎట్టిరహస్యమేని వచింపవచ్చును.

సామ- ఏమియు లేదు. ఔరంగుఁడు మనకు లోఁబడి ససైన్యముగ నడ చునప్పు డాతనిఁ జూడఁ దలంచి విమల తమయాజ్ఞకై వేఁచి యున్నది.

రాజ- (నవ్వుచు) ఇదియేనా మహారహస్యము. నిరభ్యంతరముగ రా వచ్చును. తోడ్కొనిరమ్ము ఆతురక్రము చ్చునిచ్చుటఁ జూడ వచ్చును.

సామ- (నిష్క్రమించి విమలతోఁ బ్రవేశించును)

విమ- నాథా! అర్ధాంగి నమస్కరించుచున్నది.

రాజ- అర్ధాంగినామము సర్వదా సార్థకముఁ జేయుదువుగాక.

విమ- పురుషుఁడు నవనాగరకుఁడైన స్త్రీకది కష్టతరము కాదు.

రాజ- నిజంబ. ఉదయపురిబేగముగారిచే సపర్యఁ గైకొంటివా?

విమ- ఒకయుదయపురి గారిచేతనే కాదు. తమ యనుగ్రహమున్న పాదుషాగారిని వాఁకిలికాఁపరిం జేసి యూడిగముఁ జేయింపనా?

రాజ- వీరసతుల కసాధ్య మేమియు లేదు.

విమ- నాథా! యీయవురంగుసఁ గూర్చి నాకొకపలుకుఁ బలుక మనసగుచున్నది. ఆజ్ఞ యొసఁగితిరా.

రాజ- నీయట్టి సతికి నాజ్ఞయిచ్చెడి మాత్రవు వాఁడనా నేను. నీ యిష్టము.

విమ- నాథా! నీయానచొప్పున నేవియోమాటలాడ సాహసించితిని.
ఓరి ఔరంగా! నావాక్యము లించుక యాలించుము.

సీ॥ ఇందిర చెంత నోరెత్త నేరక భయ
వశమున గడగడ వడఁకినావు
అవినీతి విమలదాస్య మభిలషించి న
లువది వేల్సేనఁ గోల్పోయినావు
అర్థాంగినిఁ శత్రుహస్తగతఁ జాన
ర్చియు బ్రతుకఁగ సాహసించినావు
రాజసింహుని గెల్వ యోజించి నేఁటికీ
రీతి పరిభవ మార్జించినావు
తే॥ గీ॥ పోటుమాటలు కోటలదాఁటుఁగాని
పలికినట్టుల నోకటేని సలుపలేని
వాఁడవైతివి జయమువైరికే "యె
వండుత్రవ్విన గోతిలో వాఁడెపడును"॥

రాజ- సతీ! చచ్చినవాని సింక నేల చంపెదవు. ఏమూలనో ప్రాణమాత్రా వశిష్టుఁడై పడియున్న నౌరంగజేబు నిఁక పారుష్య వాగ్బాణంబులచే నొప్పింపకుము. ఎంతదురాచారుఁడైనను ప్రభువుగదా యతఁడు.

సామ- అయ్యా! మనమువచ్చినపని పూర్తియయ్యెఁగదా. ఇఁక నీమహారణ్యమున నేల వసింపవలయును. ఉదయపురికిఁ బోవుదమా?

రాజ- రూపసింగు సంధినిబంధనలఁ దురుష్కులకుఁ జెప్పి వచ్చుటకుఁ బోయియున్నాఁడు. అతఁడు పర్యవసానముఁ దెల్చికొని వచ్చినఁగదా మన ముదయపురిఁ జేరుట.

సామ- అదే రూపసింగు వచ్చుచున్నాఁడు.

(రూపసింగు ప్రవేశించును.)

రూప- రాజసింహా! ఔరంగజేబు మీరుసచించిన సంధినియమముల కన్నింటి కంగీకరించినటుల సిదియె వ్రాసి యిచ్చినాఁడు.

రాజ- (చూచి)సరియే బాగుగనున్నది. ఈపూటకుబదలియున్న మొగలాయిసైనికులకు మనపరిచారకులనె భోజన సదుపాయము లాలోచింపుమని చెప్పుము. భోజనానంతరము తురుష్క-సైన్యము ను గౌరవముగ మనసేనతో బ్రోలిమేరవఱకుఁ బంపిరమ్మనుము.

సామ- సామల్పండితుని మాటలిఖియుని రూపసింగూ! తురుష్క-సేనకిట్లు చెప్పెదవా? అయిన నా కెంకులకంతటి సాహసాతో విరోధము.

రూప- నేను తాను చెప్పినసంగతులన్నియు నిదివఱకె స్వతంత్రించి మనసైనికులకుం జెప్పితిని. వాండ్రాపనియం దప్రమత్తులై యున్నారు. స్వాతంత్ర్యమునకు ముప్పుంపుఁడు.

రాజ- మిత్రమా! మంచిపని యొనర్చితివి. ఇప్పటికి మనదేశారిష్టము తీఱినది. ఔరంగునకు మనయుపురికిఁ బరాభవము, నీకు నిందిరకు సమాగమము, పద్మాశివసింగులకుఁ గళ్యాణము, విమలయుద్దేశము నెఱవేఱె. ఇంక మనకేకొఱంతలేదు. ఐన నిట్లుఁగాత.

భరతవాక్యము.

ఆ. వె. పరమసాధ్వి మానభంగ చేతస్కులు
పరులకలిమి కాసపడెడివారు
జన్మభూమి కెగ్గుపలుపు చండాలురు
శ్రీశుకరుణచే నశింత్రుగాక॥

సామ- తథాస్తు. తథాస్తు. (యవనికవ్రాలును)

సప్తమాంకము- సర్వము
సమాప్తి.



# * శుద్ధపత్రిక. *

| పేజి. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 7 | 8 | అమాయకుఁడు | అమాయికుఁడు |
| 8 | 4 | మన్మథలు | మన్మథులు |
| 10 | 10 | వాఱనిరి | వారనిరి |
| 12 | 27 | బాలకు | బాలిక |
| 20 | 18 | అలంగీడు | అలంగీరు |
| 25 | 7 | దుస్తుఁడు | దుస్తులను |
| 28 | 13 | బ్రతిష్ట | బ్రతిష్ఠ |
| 36 | 23 | ఁకదొ | కఁదొ |
| 49 | 15 | ఇఅంద | అంద |
| 51 | 19 | చెర | చేర |
| 54 | 15 | నిష్టలు | నిష్ఠలు |
| 56 | 19 | కెటి | కోటి |
| 58 | 9 | చరిత్రము | చరిత్ర |
| 59 | 3 | పున్నమి | పున్నము |
| 84 | 22 | బంధీకృత | బంధీకృత |
| 86 | 9 | స్వమత | స్వమత |
| 87 | 16 | విమలకి | విమలకీ |
| 91 | 15 | కొఅకే | కొఅకె |
| 92 | 2 | జయాంబరకేసిర | రణాంబరికేజయ |
| 93 | 8 | ఎత్తింతువో | ఎత్తింతో |
| 96 | 10 | వేర్పితి | వేర్చితి |
| 96 | 28 | పరిశీలనము | పరిశీలనముగల |
| 101 | 17 | యొక్కవ | యొక్కవ |



మఱికొన్ని శకటరేఫ అర్ధానుస్వారలోపములు గలవు విస్తరభీతిచే విడచితిమి.

శ్రీరస్తు.

## నాటక ప్రదర్శనానంతరము కవులచే రచింపఁబడిన యభిప్రాయ పద్యములు.

### పాదుషాపరాభవ నాటకప్రశంస.

---

చ॥ గురుతర మంజులప్రసవ గుచ్ఛగళ న్మకరందమాధురీ
భరిత వచో౽భిరామ రసవత్పదపద్య నిధాన భావబం
ధుర భవదీయ నిర్మలమృదు స్తవనీయ నితాంతసాహితీ
భరిత కవిత్వతత్త్వపరిపాటినిఁ దెల్పెడి మేటిపాదుషా
పరిభవ నాటకాంతరిత పాటవముం గొని కూడ కవ్యరె
వ్వరు నిరవద్యమై విబుధవందితమై సుకుమారవాగ్ధురం
ధరమయి శ్రావ్యమై శ్రుతిహితప్రదమై ఘనమై పొసంగునీ
పగమకవిత్వశైలి యొకపారి నిరర్గళసూక్తివంతమై
సరసిజపత్త్రిలోచనల చారుతరాధరపానకంబుతో
నెఱపును మైత్రి యొక్కఁడు నిశ్చలరమ్యరసానుకూలవి
స్తరమయి వాచవుల్ చెలఁగఁ దాలిమిఁగూరుచు, నొక్కమాఱు వి
స్ఫురదురురూపయుక్తయగు ముద్దియ కూటమికీడుజోడుగాఁ
బరగి సుకంబుఁగూర్చు వరభావములో? స్పృహణీయపాండితీ
పరిచిత నన్నయార్యకృత భారతభారత సారసంగ్రహో
దరమువహించి తిక్కకవితల్లజ సల్లలితప్రశస్త ధీ
భగ పరికల్పితప్రచుర పర్వసమాహృత పద్యజాల వి
స్ఫురణముబోలు నొక్కతఱి శ్రోత్రహితంబొనగూర్చు, నొక్కమా
రురువిధి రోమహర్షణము లొక్కమొగిన్ మొలపింపఁజేయు, న
బ్బుర మొకసారి నెమ్మదిని మోసులు గాంచఁగఁజేసి కన్గవన్
బొరిపొరిసముద్రాశ్రువులఁబొంగఁగఁజేయును, మేలు బాపురే
అరరె సెబాసటంచుఁ గొనియాడనిపద్యము నీకవిత్వమం
దరసిన, హానివృత్తిగొని యద్రిగుహాళిఁ దపంబుసల్పునై

శరములనొంది గాంచినను బట్టునుబట్టి శ్రమంబుచేసి రే
కరువొనరించినన్ దొరకఁగాఁగలదే! నినునెంత మోహతా
పరిణతితోడుతన్ వలచివచ్చెనొ యక్కవిశాలతాంగి సుం
దరమగుశయ్యలన్ దోనిపి తన్పునొకప్పుడు బంధవేతృతా
గరిమలజూపి సమ్మదముకల్పఁజేయునొకప్డు సత్పదా
కరరుచి తాండవింప సొడికంబుగ నర్తనముల్ పొనర్చు నే
సరణితటస్థమైన వ్యభిచారముసల్పదు చౌర్యదుష్క్రియా
విరచనముల్ పొనర్ప దెదవిన్నదనంబువహించి నీరస
స్థిరమువహింప దిట్టిదువిచిత్రచరిత్రకవిత్వకాంత తా
నిరుపమలీల శ్రీకటికి నేనిపు తేజాలయాఁ దుష్టుడై
వంలిరయు తల్లివంకఁగలబంధుతకై యరుదెంచి నీపయిన్
దిరముగఁగుంచితంబులును దిర్యగకారణచాలనమ్ములై
యరుదగు వాఁడిచూపుల నొయారముగా వెలయించి మించి యిం
దిరపదపద్యజాలములఁ దియ్యనిభావము పాదుపావచః
కరణిని శౌర్యముల్ విమలగాదిలిపల్కులముద్దులున్ దమా
వరుఁడగు రాజసింహు రసవాక్యములందున దేశభక్తియున్
దురకకులంబునన్ జెలుపఁ దోడ్పడసాగిన రూపసింగు ధీ
వరుని వచఃప్రచారముల వైరినిగర్హణశక్తియున్ పర
స్పరమనురక్తిగూడుటకుఁ బద్మవచించు వచస్సులందు సా
దరమును గూర్చినంచును పెదన్ దలపోసెద. విన్నపంబుస్వీ
కరణమొనర్పుమయ్య కులకాంత కవిత్వపయోజనేత్రయున్
బరమయశస్సరోజముఖి, భాసురరాజ్యరమాపురంధ్రి నిన్
దరివిరి ఒక్కమాసా శ్రమదక్క ఫలంబులభించునున్న యిం
దంవరియింపనంచు ననతిప్పసుమీ! పవతుల్ విరోధవి
స్తరమును గాంచకుండ దమి సంసరణంబునునిర్వహించి యా
గరితల నల్వురన్ ముదముగాంచఁగ జేయుము రాజ్యభారసం
భరితపరిశ్రమాదశవిపత్తులనేని కవిత్వకన్యకై
మురిపెము వీడి సంచరిలఁబోకుము స్వాశ్రితకోటి కొందువే
దటికము లేకయుండ ప్రమాదంబునసల్పుము వెల్మవారిలో

బిరుదము నెక్కఁ దగ్గ సుకవిత్వవిదుండవు; సత్ప్రతిష్ఠతో
జరుపుము కాలముల్ దిశల చారుకరస్ఫుట చంద్రచంద్రికా
కర హార ఫేనతుల్యవిలసత్పృథుకీర్తినవాంబరంబులన్
విరివిగనిల్పుమీ సుఖమువిజ్ఞత వృద్ధి ప్రశస్తి గాంచుమీ
హరియును బ్రహ్మ వాణి కమలాలయ నిన్ను నమోఘసచ్ఛుభా
కరునిఁ జేయుచుందురని గాటపురీతివచించియింతతో
హరువుగ నాదువాక్యముల నాపెద వేంకటకృష్ణరాణ్మణీ॥

ఇట్లు భవదాస్థానకవులు
శేషాద్రిరమణులు, సోదరకవులు.
శతావధానులు.

---

మ॥ సరసంబై మృదువై మనోహరసమాసప్రావృతంబై వియ
త్సరిదుత్తుంగసమానయాన యయి యచ్ఛంబై యవిచ్ఛిన్నమా
ధురితంబై కవివర్ణనార్హమయి సంతోషప్రదంబై నిరం
తరమై యొప్పెడు నీ భవత్కవితకృష్ణారాయభూపాలకా॥

చ॥ కవనముఁ జెప్ప నేర్చెదరు గ్రంథములన్ రచియింప నేర్తు, రా
జువుగ మహీజనావళులమాడ్కిఁ వేడ్కఁగ "పాదుషాపరా
భవము"ను సల్పనేర్చు కవివర్యులకుండురె! యెందునద్ధిభూ
ధవుఁడవు గాన సల్పితివి తథ్యము వేంకటకృష్ణభూపతీ॥

ఉ॥ స్వాంతమునం దొకించుకయుం జంకనుమాట మొలేక "పాదుషా"
చెంతనునిల్చి యిందిర వచించిన మాటలనీదు రాజసం
బంతయుఁ జూపినాఁడ వహహా పులకాంకురితాంగుఁ జేయుచు
న్నెంతటిమూఢమానసుని నేనియు విన్న వసుంధరాధిపా॥

సీ॥ ప్రథమవిరచితంబు భారతకథయయి
యలరారు "పాండవీయమ్ము"కంటె
సకలవిద్వత్కవీశ్వరవర్ణితంబయి
యలరు "యౌవననిర్వాణము"కంటె
కాళిదాసునిమహాత్కవితారసంబును
దెలిపెడి "శృంగారతిలక"కంటె

ననుభవవిరచితంబై మంచియూహల
గణుతిఁ గాంచిన "వియోగమ్ము" కంటె
నవరసంబులకును నిధానంబు గాన
భవ్యమగు "పాదుషాపరాభవ" మటంచు
దలఁతు నీచిత్తమున నెట్లుదలఁతువో క్ష్మా
పృథులసత్కీర్తిధౌరేయ కృష్ణరాయ॥

చ॥ సరసకవిత్వమందునఁ బ్రశస్తమునందినవారు పెక్కురు
ర్వరపయినున్నవారనుట వాస్తవమందులకొప్పుకొందు రా
ద్రరసమునందు నీకరణి వ్రాసెడువారలు లేరటంచు సు
స్థిరమతితో భయంపడక చెప్పెద నిందిగరీతి భూపతీ॥

2—8—16
పెనుగంచిప్రోలు.

ఇట్లు
కోలాహలం సీతారామరాజు

---

శ్రీరస్తు.

సీ॥ సరసజ్ఞులగు పాఠకజనులు సంతోషింపఁ
గలిగినయట్టి శృంగారరసము
కరవాలములను నిక్కడనున్న వారిచే
వెదకింపఁగా జేయువీరరసము
కఠినమానసుఁడేని కన్నీటినలజడిఁ
దుడువకే తప్పని దుఃఖరసము
కడుపుబ్బునటులఁ బ్రేక్షకులసంతసముచే
హాయిహాయనినవ్వు హాస్యరసము
గీ॥ కుప్పలుగ గ్రంథమందున గుప్పిగుప్పి
పాఠ్యుఁడవౌట స్వానుభవంబుచేత
వ్రాసితివిగాక అన్యులువ్రాయగలరె
తపముఁజేసియు వేయేండ్లు ధారుణీశ! ॥

క॥ నవరసములకు నివాసము
లవనీశులహృదయసీమ లనిదెల్పుటకీ

నవరసయుక్తంబగుమీ
ప్రవిమలనాటకమెసాక్షి పార్థివ! మఱియుక్
చ॥ అవనివిభుండు గావునఁ బ్రియాంగనభూపతిపైనిఁ గల్గుగా
రవమునఁ జక్కఁగానిటుల వ్రాయఁగఁజాలెనుగాక ధాత్రిసే
శవికటువాగ్రియుధీపటిమగల్గు నటందురు "పాదుషాపరా
భవము"ను గాంచినట్టి బుధవర్యులు వేంకటకృష్ణభూపతి॥
సీ॥ భావనాశక్తిసంభరితంబుగను గవి
త్వమునువ్రాసెను కవిత్రయముభాతి
భానురదీర్ఘసమాసకవిత్వంబొ
నర్పఁజాలుదువు శ్రీనాథు, భంగి
శ్లేషకవిత్వంబుఁ జెప్పఁగానేర్తువు
ముద్దుగొల్పు మాభట్టుమూర్తిమాడ్కి
రసవత్తరముగ విరాజిల్లుకవనంబు
నల్లఁగాఁగలవు పెద్దన్నరీతి
గీ॥ యామహాసత్కవిప్రచయాంశమున జ
నించినాఁడవో! లేకున్న నీకునిట్టి
కవనమెట్లబ్బఁగల్గె నిక్కముగఁజెప్పు
కీర్తికాంతామణీగేయ! కృష్ణరాయ!॥
చ॥ కడురసవత్కవిత్వమిడి; కాంచినవారలు ముక్కుపైనివే
లిడుకొనునట్టి రాజ్యరమనిచ్చి; కవీంద్రులఁ బ్రేమతోడఁ జె
ప్పుడు నిటులేగనుంగొనెడిబుద్ధినొసంగి; దయామయుండు నే
వుడుకృపతోడనిన్నెపుడు బ్రోచెడుగావుత కృష్ణభూపతీ॥

ఇట్లు, భవదాశ్రితుఁడు
మాక రాజా నారాయణరాజా.

---

# పాదుషాపరాభవము

ఉ॥ కవివరులెల్ల కవీశుఁడవఁగా నుతికెక్కి సమగ్రపాండితీ
ధవులెదమెచ్చ నీదుకవితావనితామణి నేర్పుఁజూపఁ పైం

దవచరితాత్మికంబగు కథద్దెలుపదగు పాదుపాపరా
ధవమును నీవెగాఁగొరులు వ్రాయఁగలారొకో కృష్ణరాట్ప్రభూ॥

క॥ మృదువై మాధుర్యంబై
పదిమందికి మెప్పుఁగూర్చు పదసంభృతమై
చదివినవారలఁదిని సంతస
మొదవించెను నీదుకవనమో భూ[illegible]ణీశా॥

మ॥ పలుకన్ తేనెలసోనలొల్కుచు యశఃప్రాగల్భ్యసంధాత్రియై
తళుకుల్ గూర్పఁగజాలి భూమిజకటోద్యద్వాగవల్లిప్రకీర్ణా
త్కలనాకౌశలమైన మీ సుకవితాకాంతాలలామంబు నే
ర్పలర వ్వర్ణనసేయఁబూన భువిసామ్యంబేది కృష్ణప్రభూ॥

గీ॥ నవరసంబులతోఁనిండు నాటకంబు
వ్రాయనులభంబె కవులన్న వారికెల్ల
నవరసాకరమతికి నీకవును గాఁక
కృతివినిర్మాణధౌరేయ కృష్ణరాయ॥

సీ॥ అసదృశమాధురీ రససమన్వితమాట
నన్నపార్యునిసమానంబుఁ గనియె
పల్కుపల్కున ముద్దులొల్కి మోహనమాట
తిక్కనకెసయంచుఁ దెల్పుచుండె
అసమసమాస సమాహితంబౌట శ్రీ
నాథకవికిజోడనంగవరలె
శృంగారరసము మూర్తీభవించుటచేత
పెద్దనకవివరు నుద్దియయ్యె
సకలపండితులానంద సరసిముసఁగ
రమణగాంచెడి భవదీయ రచితమైన
పాదుపాపరాధవమను భవ్యసుకృతి
కీర్తిసంభృతి వేంకటకృష్ణనృపతి॥

చ॥ క్రమముగఁ గృష్ణరాయలకు సరాసరిగాఁగవియై కవీశబృం
దము ముదమొంద గౌరవయుతంబుగ పోషణచేయుచుండి గ్రం
థములనువ్రాసి వ్రాయుచు సతంబు కవిత్వమునుద్ధరింప డెం

దమునఁదలంచె పూజ్యుఁడు నుదారుఁడు గంపలగూడెమున్న గ్రా
మమునకుమారరాజగుణ మాన్యుఁడు వేంకటకృష్ణరావు సా
మమున దెలంగుభూ పుఁడిలు మాత్రము నీకుఁ గొంతయుండుప
తమ్మున గ్రహింపఁ దట్టిప్రభు సత్త్వము ప్రాఁపయియుండెనో కవి
త్వమ! యికఁ దేను వందగును భాగ్యమటన్నను నీయదే సుమీ॥

ఇట్లు

గంపలగూడెము
ది 2-8-16

భవదాశ్రితుఁడు
కోట బాపయ్య.



# ప్రకటన

శ్రీకృష్ణరాయ గ్రంథమాలలో రాఁబోవు గ్రంథములు.

1. సత్యభామాపరిణయము. (పద్యకావ్యము) చండపాండిత్య బిరుదాంకితుఁడగు పట్టాభిరామామాత్య కవిచే రచియింపఁబడినది. శైలి శుద్ధమైయనర్గళమై మనోహరమై యుండును. సెప్టెంబరు నెలాఖరున ప్రకటింపఁబడును.

2. స్వర్ణమేఖల (నవల) కృష్ణరాయలవారు కనకగిరి(కనిగిరి) కోటఁ బట్టుకొనుట, వీరరుద్రగజపతి కృత్రిమకృత్యములు, ఆకాలదేశస్థితులు, తిమ్మరసుగారి రాజకీయచాతుర్యము ఇందు చక్కఁగ చర్చింపఁబడినవి. రచయితలు. శతావధానులు శేషాద్రి రమణ కవులు, 1917 జనవరి నెలాఖరులోఁగా ప్రకటింపఁబడును.

3. ఆంధ్రకవితాసర్వస్వము. (విమర్శము) కళాపూర్ణోదయ ప్రభావతి ప్రద్యుమ్నముల రచనాచాతుర్యముం దెలుపును. కవిత్వతత్త్వ విచారమందలి యప్రస్తుత విషయ ఖండన కూడకలదు. గతానుగతికచేఁ బూర్వకవుల శక్తియుక్తులుకూడ చర్చింపఁబడెను. భాషాభిమానులు చూడఁదగినది. మే నెలాఖరులోఁగాఁ బ్రకటింపఁబడును. (మా శాశ్వతచందాదారులకుఁ బ్రతిపుస్తకము 100పుటలకుఁ బోస్టేజితో 0-6-0లు ఇతరులకు 100పుటలకు పోస్టేజికాక రు0-8-0చొప్పున నొసంగఁబడును.

(గ్రంథమాలవిషయమై యుత్తరప్రత్యుత్తరములు ఈక్రింది చిరునామకు వ్రాయవలెను)

కంపలగూడెం, కృష్ణాజిల్లా

దూ. తి. వేంకటరమణాచార్యులు,
కార్యదర్శి శతావధాని



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA121B105 |
| పుస్తకం పేరు | పాదుషా పరాభవము |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 139 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | F/H |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Habeeba |
| పేజీలు విడదీసినది | Rohith |
| స్కాన్ చేసినది | Haseema |
| పరీక్ష చేసినది | DAVEED |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |